ఆం. ప్ర. ప్రభుత్వ ఎపిగ్రఫి ప్రచురణ సంఖ్య 9.

# అశోకుని ఎఱ్ఱగుడి శిలాశాసనములు

*రచయిత:*

**డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యము,** ఎం. ఏ., పిహెచ్. డి.,
ఎఫ్. ఆర్. ఏ. ఎస్. (లండన్)

సూపరింటెండింగు ఆర్క్యాలజిస్టు, ఆర్క్యాలాజికల్ సర్వేశాఖ,
భారత ప్రభుత్వము, న్యూ ఢిల్లి.




*సంపాదకులు:*

**డాక్టరు యన్. రామేశన్,** ఎం. ఏ., పిహెచ్.డి., ఐ. ఏ. యస్.,
ఎఫ్. ఆర్. ఏ. ఎస్. (లండన్)

పురావస్తుశాఖ డైరెక్టరు – రెవెన్యూబోర్డు మెంబరు.

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పురావస్తుశాఖ ప్రచురణము

హైదరాబాదు,

**1975.**

# తొలిమాట

ప్రాచీన భారత లేఖనములలో సింధులోయనాగరికతకు చెందిన ముద్రలపై గానవచ్చు అక్షరముల తర్వాత క్రీస్తు పూర్వము మూడవ శతాబ్ది నాటి మౌర్య చక్రవర్తియగు అశోకుని శాసనముల లిపియే చెప్పదగి యున్నది. సింధు నాగరికత ముద్రలపై నున్న అక్షరములను అశోక శాసనాక్షరములతో పోల్చి చదువుటకు వీలగు వేరొక లిపి ఆ మధ్య కాలమున కానరాదు. కనుక భారతీయ లిపులలో సువ్యక్తముగ నున్న ప్రాచీన లిపి అశోకుని శాసన లిపియే. ఈ చక్రవర్తి వ్రాయించిన శిలాశాసనముల సంపుటి ఆంధ్రదేశమునందు కర్నూలు మండలము లోని జొన్నగిరి – ఎఱ్ఱగుడి గ్రామముల యొద్ద నున్న కొండపై నున్నట్లు 1928 లో మొదట కనుగొనబడెను. కాని వాటి పూర్తి పాఠము 1957–58 లో గాని ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రచురింపబడలేదు. ఆ సమ్రాట్టు యొక్క దక్షిణ రాష్ట్ర రాజధాని యగు సువర్ణగిరి 'సొర్నగిరి' 'జొన్నగిరి'గా మార్పునొందెనని పలువురి నిశ్చితాభిప్రాయము. ఆ రాజు తన ధర్మ ప్రబోధములను అప్పటి ప్రజా సామాన్యము మాటాడు భాషయందే వ్రాయించెనని కూడ నిశ్చయించిరి. గనుక ఇచటి ప్రజలు క్రీస్తు పూర్వము కొన్ని శతాబ్దములనుండి ఈ శాసన భాషయగు ప్రాకృత భాషను మాట్లాడుచుండెడి వారనియు, అందలి బ్రహ్మి లిపియే వారి వ్రాత కట్టు అనియు చెప్పవలసి యున్నది. తెలుగు ప్రజల ప్రాచీన చరిత్రకు మొదటి ఆధారము ఈ అశోకుని జొన్నగిరి శాసనములే. కనుక వీటిని నేటి తెలుగు ప్రజలకు తెలియునట్లు ప్రకటించుట అవసరమని కొందరు ప్రముఖులు సూచించుట చేత 1971 లో రాష్ట్ర శాసనసభయందు అమాత్యవర్యులు అశోకుని యొక్క యీ ధర్మ శాసనములను సులభమగు తెలుగులోని కనువదించి ప్రకటించుదుమని వాగ్దానము చేసియుండిరి. తదనుగుణముగ నీ బాధ్యత ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పురావస్తుశాఖ కొసగబడెను. ఆ శాఖకు చెందిన సలహా సంఘము డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారిని ఈ శాసనముల సంపుటిని అనువదించ కోరుచు 1971 లో తీర్మానించిరి.

ఈ శాసనములకు క్రొత్తగా ప్రతిరూపములు సేకరించుటకు కొంత కాలము పట్టెను. వీటిలో ననేక భాగములు శిలాతలములు నునుపుగ లేకపోవుటచే అస్పష్టముగ నుండెను. వాటిని సావకాశముగ పరిశోధించి పాఠాంతరములను స్వీకరించుచు డాక్టరు సుబ్రహ్మణ్యముగారు మిక్కిలి శ్రమతో ఈ రచన గావించి యుండిరి. బ్రహ్మి లిపియందు, ప్రాకృత, పాలీ భాషలయందు వారికి గల వైదుష్యము

అనుభవము అసమానమగుటచే అశోకుని యితర శాసనములతో సరిపోల్చుచు ఆంధ్ర దేశము నందలి యీ జొన్నగిరి పాఠములను సమగ్రముగ తెలుగులో పరిష్కరించిరి. ఆ ధర్మ నిబంధములను నిర్దుష్టమగు తేటతెలుగులో వివరించుట వీరి రచనా విశేషము. వారు వ్రాసిన ఉపోద్ఘాతము, ఉపసంహారములు, విషయమును సుబోధ మొనర్చుటలో తోడ్పడగలవు. ఇయ్యది జన సామాన్యమున కేగాక, విద్యార్థులకు, విద్వాంసులకు, పరిశోధకులకు పలువిధములుగ తోడ్పడగలదు. శాసన మూలములు ప్రాకృతభాషలోనే నేటి తెలుగు లిపిలో నొసగబడుటచేత భాషా శాస్త్రము నభ్యసించు వారికిని, నీతి బోధకమగుటచే పాఠశాలలందు బాలబాలికలకును ఈ చిన్ని పొత్తము మిక్కిలి ఉపయుక్తము కాగలదు. ఇట్టి అమూల్యమగు రచనను సమకూర్చిన డాక్టరు సుబ్రహ్మణ్యము గారికిని, ప్రోత్సహించిన రాష్ట్ర ప్రభుత్వమువారికిని తెలుగు ప్రజలు సర్వదా కృతజ్ఞులు.

చక్కని పటములతో ఈ పొత్తమును నిర్దుష్టముగ ముద్రించుటలో తోడ్పడిన పురావస్తు శాఖోద్యోగులు, టెక్స్టుబుక్ ప్రెస్సు ఉద్యోగులు ప్రశంసార్హులు.

పురావస్తుశాఖ,
ఆంధ్రప్రదేశ్.
6-2-1975.

పి. వి. పరబ్రహ్మశాస్త్రి,
డిప్యూటీ డైరెక్టరు (ఎపిగ్రఫీ).

# విషయసూచిక

# అశోకుని ఎఱ్ఱగుడి శాసనములు

— డాక్టరు రాయప్రోలు సుబ్రహ్మణ్యాం, M.A., Ph.D.

ఎఱ్ఱగుడి గ్రామము కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకాలో గుత్తి రైల్వే స్టేషనుకు వాయవ్యముగ సుమారు 8 మైళ్ల దూరమున గలదు. ఈ గ్రామమునకు పశ్చిమమున చిన్న రాతిగుట్ట కలదు. ఈ గుట్టకు 'ఏనుగకొండ' యని, 'నల్లఏనుగకొండ' యని పేర్లుకూడ కలవు. ఈ గుట్టలో ఆరు శిలలపైన శాసనములు చెక్కబడియున్నవి. ఈ శాసనములను తొలుదొల్త కనుగొన్న వ్యక్తి భూగర్భశాఖకు చెందిన ఎ. ఘోషు. ఇతడు 1928లో ఖనిజములను కనిపెట్టుటకై ఈ ప్రాంతములో పనిచేయ పంపబడినాడు. ఈ శిలలపైనున్న వ్రాతలను జూచి ఈ ఉద్యోగి నాటి పురాతత్త్వ శాఖ డైరెక్టరు జనరల్ హెచ్. హార్‌గ్రీవ్స్‌గారికి తెలియబర్చగా నాతడు తన క్రింది ఉద్యోగియైన శ్రీ దయారాం సహాని గారిని ఈ శాసన పరిశోధనకై పంపిరి. సహానిగారు, నాటి శాసనపరిశోధన శాఖాధ్యక్షులైన శ్రీ హరప్రసాదశాస్త్రిగారితో ఎఱ్ఱగుడి దర్శించి 1929 ఫిబ్రవరిలో ఈ శాసనములకు ముద్రలను తీసిరి. వీరు పరిశోధించిన శాసనములలో అశోకుని శాసన వర్గమునకు చెందిన 4, 12 శాసనములు మాత్రము లేవు. తర్వాత తర్వాత శాసన పరిశోధన శాఖలో పనిచేసిన విశ్వనాధగారు వీటినిగూడ కనుగొని ముద్రలను తీసిరి. ఈ శాసనముల ప్రాముఖ్యతను గురించి నాటి పురాతత్త్వ శాఖ డైరెక్టరుగారు 1929 జూన్ 11వ తేదీన పత్రికాప్రకటనకూడ చేసియున్నారు.

ఇట్లు అధికారులు ఈ శాసనమును పరిశోధించి పరిష్కరించి, ప్రచురించు ప్రయత్నములోనుండగనే, ఆంధ్ర చరిత్ర సంస్కృతి పరిశోధనే పరమావధిగ జీవించి, శాసన పరిశోధనలో తనకుతానే సాటియైన కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, మద్రాసు విశ్వవిద్యాలయంలో చరిత్రశాఖకే వెలుగు తెచ్చిన డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు, కర్నూలుమీదుగ ఎఱ్ఱగుడిచేరి ఈ శాసన ముద్రికలను రహస్యముగ తీసి 1929 సెప్టెంబరు 'భారతి' పత్రికలో ప్రచురించినారు.

ఈ శాసన పరిశోధకశాఖవారు తమ త్రైమాసిక పత్రిక "ఎపిగ్రాఫియా ఇండికా"లో ప్రచురించవలెనని ఆ కార్యభారమును శ్రీ హరప్రసాదశాస్త్రిగారికి వదలిపెట్టిరి. కాని వారి ఉద్యోగవిరమణనాటికి వారి విమర్శక వ్యాసము పూర్తికాలేదు. వారి తర్వాత శ్రీ దయారాం సహానిగారు ఈ పనిని చేయబూనిరి గాని వారి అకాల మరణముతో ఈ శాసన ప్రచురణ ఆగిపోయినది. తర్వాత డాక్టరు ఎన్. పి. చక్రవర్తిగారు తాము స్వయముగ ఎఱ్ఱగుడి వెళ్లి శాసన ముద్రికలను తీయించి శాసన మూలమును

చిత్తుప్రాసికొనివెళ్లిరి. వారుకూడ ఈ కార్యమును పూర్తిచేయకనే కీర్తిశేషులైరి. వీరి సహాయముతో లభించిన ముద్రలతో శ్రీ బేణి మాధవ బారువాగారు తమ "అశోకుని శాసనముల"ను గ్రంథములో ఈ శాసన ప్రాశస్త్యమును గూర్చి వివరించిరి. ఈ శాసనమును పూర్తిగ శాసన పరిశోధక శాఖాధ్యక్షులుగ నుండిన శ్రీ డి. సి. సర్కారుగారు 1957-58 లో "ఎపిగ్రాఫియా ఇండికా"లో ప్రచురించిరి.

ఈ శాసనమును తొలుదొల్త పరిష్కరించిన శ్రీ దయారాం సహానిగారు శాసన శిలలకు A, B, C, D, E, F, అని పేరిడిరి. శాసనము చెక్కినరాళ్లు సరిగా మలచి, నునుపు తేల్చనందున అక్షరములు సులభముగ గుర్తించి చదువుట కష్టమైనది.

వీటిలో 'A' శిల సుమారు ఇరవై అడుగుల ఎత్తున కొండకొనపైన గలదు. దీని క్రిందిభాగము విరిగిపోయినది. ఈ శిల తూర్పుముఖమున 17 అడుగుల 6 అంగుళముల వెడల్పున అశోకుని ధర్మలిపులు I, II ను, చివర III వ ధర్మలిపి శాసనమును, పైగా కొంచెము పల్లముగనున్న భాగమున XIV వదియు కలవు. ఈ శాసనములను చెక్కునప్పుడు శాసనముల ఆద్యంతములను తెల్పుటకు చోటు వదలనందున శాసన మెచ్చట అరంభించునో, ఎచ్చట అంతమొందునో తెలిసికొనుటకూడ కష్టసాధ్యమైనదే. తక్కిన శాసనములుకూడ అటులనే ఒక తీరుతెన్ను లేకుండ చెక్కబడినవి. శాసనశిల 'F' మీదనున్న శాసనములు మాత్రము చక్కగనుండి చదువ వీలగుచున్నది.

శాసనలిపి :

ఎర్రగుడి శాసనములు బ్రాహ్మిలిపిలో వ్రాయబడినవి. దక్షిణదేశమున ముఖ్యముగ ఆంధ్రదేశమునందు నాడు వాడుకలోనున్న లిపి 'బ్రాహ్మి'యే. సాధారణముగ బ్రాహ్మిలిపిలో మలచిన శిలాశాసనములు ఎడమనుంచి కుడికి చదువుట ఆచారము. 'ఖరోష్ఠి' లిపిలోని శాసనములను కుడినుండి ఎడమకు చదువుట పరిపాటి. ఎర్రగుడి శాసనములలో 'F' శిలలమీద మలచిన 'బ్రాహ్మి" శాసనములు కొన్ని ఎడమనుంచి కుడికి, మరికొన్ని కుడినుంచి ఎడమకు వ్రాయబడియున్నవి. ఇంతేకాక, కొన్నిచోట్ల అక్షరములు, మాటలుకూడ ఉండవలసిన ప్రదేశములందుకాక, వేర్వేరుచోట్ల చెక్కబడియున్నవి. ఈ వ్రాత భేదములు ప్రాయశః 'ఖరోష్ఠి' లిపి వ్రాయుట కలవాటైన వ్రాయసగాండ్రకు ఈ శాసనమును మలచుపనిని అప్పగించుటవలన కలిగియుండవచ్చునని లిపి శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

శాసనభాష ప్రాకృతము. 'F' శిలపైని శాసనభాష, తక్కిన రాళ్ళపైనున్న శాసనభాషకన్న వేరైయున్నందున, 'F' శిలాశాసనములు తక్కినవానికన్న ప్రాచీనములని, ఎర్రగుడియందు ప్రప్రథమమున మలచబడిన అశోకుని శిలాశాసనముల లిపియని లిపిశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

అశోకుని శాసనములను సాధారణముగ గండశిలలపై వ్రాయించిన 'లఘు ధర్మలిపు' లనియు (Minor Rock Edicts) స్తంభముపై వ్రాయించిన శిలా స్తంభ ధర్మ లిపులు(శాసనములు) (Pillar Edicts)అనియు, 14 శిలాశాసన సమూహములుగ విభజించుట చరిత్రకారుల ఆచారము. 'లఘుధర్మలిపుల' (Minor Rock Edicts) భాష మాగధి. మాగధి భాషలో సంస్కృత 'ర' కారము 'ల' కారముగ మార్పుచెందును. ఎర్రగుడి యందలి లఘుధర్మలిపులలో మాత్రము ఈ మార్పు కానరాదు. ఈ విషయములో ఎర్రగుడికిని, గిర్నార్, షహబాజ్ ఘరి, మన్షేరా అను ప్రదేశములలోని అశోకుని శాసన భాషకును, సామ్యము కనబడుచున్నను, 'ణ' కు బదులు 'న', 'ష' కు బదులు 'స' వాడబడియున్నందున భాష మాగధి యని చెప్పవీలగుచున్నది. మైసూరు రాష్ట్రములో నున్న మాస్కి, సిద్ధాపుర, జతింగ రామేశ్వరమునందలి అశోకుని శిలాశాసనముల భాషయే ఎర్రగుడి శాసనములందు వాడబడినది.

ఇచటి 'పదునాల్గు ధర్మలిపుల' లోను, 'ర' కు బదులు 'ల' యే వాడబడినది. ఇందలి భాషకును, ఒరిస్సాయందలి ధౌళి, జౌగడ, కాల్సి శాసనభాషకును, చాలవరకు సారూప్యములున్నవి.

శాసనకర్త :

ఎర్రగుడి శాసనములు చాలవరకు రాజోద్యోగులైన 'రజ్జుకు' ల నుద్దేశించ బడినవి. ప్రాయశః ధర్మబోధలకై సువర్ణగిరి నగరమునందున్న 'మహామాత్రుల' కంద చేసిన రాజాజ్ఞలే ఈ శాసనములందు చెక్కబడినవి. శాసనోద్దిష్ట విషయము ధర్మాచరణ యందు రాజోద్యోగులేమేమి చేయవలయునో, ఏ ఏ విషయములం దప్రమత్తులై మెలగ వలెనో ఈ శాసనములం దుటంకింపబడినవి.

శాసనకర్త మగధ సామ్రాజ్యాధినేత, జంబూద్వీప చక్రవర్తియగు 'ప్రియదర్శి' యనురాజు. శాసనమందెచ్చటను ఈతని తలిదండ్రుల గురించిగాని, అన్నదమ్ముల గురించి గాని, భార్యలను గురించిగాని, ఇతర బంధువులను గూర్చిగాని ప్రస్తావింపబడలేదు. కాని మెగస్తనీసు వ్రాసిన "ఇండికా" వలనను, పురాణములు, కౌటిల్యుని అర్థశాస్త్రము, జైన, బౌద్ధమత గ్రంథములవలనను మనకు ఈతని పూర్వచరిత్ర కొంత తెలియుచున్నది. మరియు, మైసూరు రాష్ట్రములోని మాస్కి శాసనమువలన ఈ 'ప్రియదర్శి' మౌర్య సామ్రాజ్య చక్రవర్తి అశోకుడని తెలియుచున్నది.

అశోకుని తండ్రి బిందుసారుడు. తాత, మౌర్యసామ్రాజ్య స్థాపకుడైన చంద్రగుప్తుడు. అశోకుడు తన శాసనములలో తనకు పూర్వము పాటలీపుత్రమునేలిన రాజన్యులను స్థూలముగ ప్రశంసించినాడు. కాని తన బంధువులను గూర్చి ఏమియు తెల్పియుండలేదు. ప్రాయశః దీనికి కారణము, ఆతని శాసనములన్నియు తనలో కలిగిన

భావోద్వేగమును తెలియపరచుటకును, ప్రజలలో ధర్మనిరతిని నెలకొల్పుటకు, అహింసా సిద్ధాంత ప్రచారమునకు, తానొనర్చు కార్యకలాపములను తెల్పుటకుద్దేశింపబడి యుండుట వలనే మో.

అశోకుని జీవిత విశేషములను, పైనుడివిన గ్రంథములవలననేగాక, ఆతని శాసనములు, పాలిగ్రంథములు, బుద్ధఘోషుని 'సమన్త పాసాదికా' వలనను తెలిసికొనవచ్చును. బుద్ధుని జీవితమున జ్ఞానోదయమొక ముఖ్యమైన ఘట్టమైనట్లు అశోకుని జీవితములో అతని 'అభిషేచనము' ఒక విశిష్టమైన ఘట్టము. ఇతని అభిషేచన కాలము స్థూలముగ శాసనాధారములవలనను, ప్రాచీన గాధల ఆధారములతోను నిర్ణయింప వీలగుచున్నది.

# అశోకుని
# ఎఱ్ఱగుడి శిలాశాసనములు

(శాసన పాఠములు : అనువాదములు)

# మొదటి లఘు శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

### ( 'F' గండశిలపై చెక్కబడిన శిలాశాసనము )

1. (I)[1] దేవానాంపియే హేవాహా[2](II) అధికానిశి
2. యహాకమ్ ఉపాసకే (III) నోతు ఖో ఏకం సంవచ్ఛరం పకా[ం]తే
3. హుసం [।] (IV) సాతిరేకే ఛుఖో సవచ్ఛరేయం మయాసంఘే ఉపయిా
4. [అ][4]తే బాఢంచమ్ పకంతె [।] (V) ఇమినా చుకాలేనమి[5]సా[యె] మునిసా
5. [6]దేవేహి తే దాని మిసిభూతా[-] (VI) పకమస హి

6(a) ఇయం [[7]] (VII) మహ త్త[8]నేవ సకియ [।] (VIII) ఖు

(b) [9]ద కేనపి పక

7(a) మామినేన సకియే విపులస్వగె ఆరా

(b) [10]ధీతవె[।] (IX) ఎ (c)[11] తాయచ అధాయఇయం

[సా]వనె సావితె[।] (X) అథాఖుదుక మహాలకా ఇమం పి[పా]క మేవూ అం

తాచమే జానెవు చిరథి తికా చ

10. ఇయంపకమె హోత విపులం పి చ వఢసితా అపరధియాదియధియా[।]
11. (XI) ఇయం చ సావనే సా
12. వాపితె వ్యూథేన 200 50 6 [।]

---

1. సహాని, చక్రవర్తి దీనిని అకరముగా చదివిరి.
2. సహాని 'హేవంహా' అని, తారువా 'హేవంహా ఆ' (= హేవం అహా)
3. 'అధతియాని సంవత్సరాని' అనుమాటలు లుప్తము.
4. ఇచ్చటనుండి 16 అక్షరములు కుడినుండి ఎడమకు చదువవలెను.
5. ఇచ్చట అక్షరములు పంక్తికి ఎడముగా కొంచెము పైన వ్రాయబడినవి. ఇవి ఎడమ నుంచి కుడికి వ్రాయబడినవి.
6. అక్షరములు పై పంక్తికి క్రింద సరిగా లేవు.
7. ఇది సగము పంక్తి, కుడినుండి ఎడమకు వ్రాయబడినది.
8. ఇచట 'నోహియం' అనుమాట లుప్తము.
9. ఈ 6 అక్షరములు 5 వ పంక్తి మొదట వ్రాయబడినవి.
10. ఈ అక్షరములు 6 వ పంక్తికి పైన వ్రాయబడినవి.
11. ఈ అక్షరములు 7 వ పంక్తిలో వ్రాయబడినవి.



మొదటి లఘుశిలానుశాసనము. ('F' గండశిలపై చెక్కబడియున్నది.)

# మొదటి లఘు శిలానుశాసనము

## అనువాదము

1. దేవానాంప్రియుడీ విధముగా వాక్రుచ్చెను.
2. ఇప్పటికి రెండున్నర వత్సరములకు పైగా గడచినవి నేను ఉపాసకుడనై.
3. నేను మొదటి సంవత్సరకాలము (బౌద్ధధర్మాచరణమునకుగాని, వ్యాప్తికిగాని) తగిన పాటు పడలేదు.
4. నేను సంఘముతో ప్రమేయము కల్పించుకొని, బౌద్ధ ధర్మమును దీక్షతో పాటించి ఇప్పటికి సంవత్సరము పైగా అయినది.
5. నేటివరకు దేవతలతో కలియనివారుకూడ ఈ కాలములో దేవతలతో చేర గలిగిరి.
6. ఈ స్థితి నా బౌద్ధధర్మ ప్రచార ఫలితమే.
7. దైవత్వప్రాప్తి ధనికులకు మాత్రమేకాదు.
8. దరిద్రుడైనను చిత్తశుద్ధితో ధర్మమాచరించిన స్వర్గప్రాప్తి పొందవచ్చును.
9. ఈ కార్యము కొరకే నేనీ శాసనము చేసినది.
10. ధనికులు, బీదవారు కూడ ధమ్మమాచరించి ప్రాచుర్యము కల్గించుటయందు దాసక్తులైన నారాజ్యములోనేగాక ధర్మము పరరాజ్యములందుగూడ తెలిసి, ధర్మాచరణ యందాసక్తులైనవారు రెట్టింపగుదురు.
11. 256 దినముల పర్యటనానంతరము నేనీ సందేశమును ప్రకటించితిని.

# రెండవ లఘు శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

(I) [1]హే [వం] దేవానం [2]దేవానం పియె ఆహా [।*] (II) యథాదే

13. [3]వా [నం] పియె ఆహా తథా కటవియే [।*]

14. (III) [4]రజూకె అనపేతవియె [।*]

15. (IV) [5]సెదాని జానపద[ం] [6] ఆనా

16(a) పసయితి రథికాని చా [।*] (V) మాతాపితూసు[7]

(b) సుసు[8]

17. సితవియె [।] (VI) హేమేవ గరూసు సుసు సితవియె [।*] (VII) ర్పా (ప్రా)
నెసు దయితవియె [।*] (VIII) సచెవతవియె [।*] (IX) ఇ

18(a) మధమ్మగునా పవతితవియా [।*] (X) హెవం తుంఫె ఆనపయాథ దేవా
నం పియవచనెన [।] (XI) హె

(b) వం ఆనప

19. యాథహిథి యారోహాని కా[ర]నకాని యుగ్యాచరియాని బంభనాని చ
తు[ం]ఫే [।] (XII) హేవం నివేసయా

20(a) థ అంతేవాసీని యారిసా పొరానా పకితి [।*] (XIII) ఇయం సుసుసుత
పీయ [।] (XIV) అపచాయనాయవా ఆచరి

(b) య [స]

(c) స

(d) [హె]ం ఏవ [।][9]

21. (XV) యథావాపున ఆచరియస నాతికాని యథార్హ్వం నాతికాసుర్ప (ప్ర)
వతితవియె [।*] (XVI) హెసాపి

22. [అం]తెవాసీ సుయథార్హ్వం పవతితవియె యారిసా పొరానా పకితి [।*]
(XVII) యథార్హ్వం యథా ఇయం

23. సతిరో (రె) కెసియా హెవం తు[ం]ఫె ఆనయాథనివెస[యా]థా చ
అంతె వాసీని [।*] (XVIII) హెవం దె

24. వానంపియె ఆనపయతి [।*]

1. మిగిలియున్న 12వ పంక్తి 10వ పంక్తి క్రింద వ్రాయబడియున్నది.
2. ఈ పదము అనవసరముగ వ్రాయబడినది.
3. ఇది సగము పంక్తి, ఇందు 12 అక్షరములు కుడినుండి ఎడమకు చదువవలెను.
4. ఇదికూడ సగము పంక్తి, ఆరు అక్షరములు ఎడమనుండి కుడికి చదువవలెను.
5. ఈ సగము పంక్తి ఎడమనుండి కుడికి చదువవలెను.
6. "జానపద" : బారువా.
7. చక్రవర్తి "పితూంసు" అని చదివిరి.
8. ఈ అక్షరములు 18వ పంక్తి ముందు వ్రాయబడి యున్నవి.
9. ఈ అక్షరములను కుడినుండి ఎడమకు చదువవలెను.

# రెండవ లఘు శిలానుశాసనము

## అనువాదము

1. దేవానాం ప్రియుడీ విధముగ పల్కెను.
2. మీరు దేవానాం ప్రియుడు చెప్పిన విధముగనే నడచుకొనవలెను.
3. రజ్జుకులకు మీ రాజ్ఞ లివ్వవలెను.
4. వారు మీ ఆజ్ఞలను గ్రామసీమలలోని ప్రజలకును అధికారులైన రాష్ట్రికులకును ఈ విధముగ తెలియజెప్పుదురు.
5. "ప్రతివారు తమ తల్లిదండ్రులకు అణగియుండవలెను.
6. 'ప్రతివారు పెద్దలను గౌరవించవలెను.
7. 'ప్రతివారును జీవులపై దయచూపవలెను.
8. 'ప్రతివారును సత్యమునే వచింపవలెను.
9. 'ప్రతివారును ధర్మమునే చాటవలెను.
10. 'దేవానం ప్రియుని మాటలుగ పై వాక్యములను మీరు చాటి శాశించవలెను".
11. ఈ విధముగ గజారోహకులు, బ్రాహ్మణులు, రథారూఢులు, గురువులైన వారు తమ శిష్యులకు తెలియజెప్పవలెను.
12. వారు శిష్యులకు ప్రాచీనాచారము ప్రకారమే బోధించవలెను.
13. ఈ ఆజ్ఞ నెల్లరు పాటింపవలెను.
14. గురువునకున్న గౌరవమిందే గలదు.
15. ఈ ఆజ్ఞల పరమావధిని గురువు తన తన బంధువులైన స్త్రీ పురుషులకు తెలుపవలెను.
16. ఈ ధమ్మమునే సరియైన విధముగ బంధువులలోను శిష్యులలోను అనూచానముగ వచ్చుపద్ధతినే చెప్పవలెను.
17. మీరు సూచించిన మార్గముపైననే శిష్యులలో ధర్మదీక్ష ప్రబలుట ఆధారపడియుండును.
18. ఇది దేవానాం ప్రియుని ఆజ్ఞ

# శిలానుశాసనములు

## మొదటి శిలానుశాసనము

### (ప్రాకృత మూలము)

(‘A’ గండశిల తూర్పు ముఖము : ఎడమ వైపు సగభాగము)

1. (I) ఇయం ధమ్మలిపి దెవానంపియేన పియదసిన లా[జి]న [లిఖా]పి[తా] (II) [హిదనో] కించి [జీవె]

2. ఆలభితు పజోహితవియె [।*] (III) నొపిచ సమాజె కటవి[యె] [।*] (IV) బహుకం[హి] దెవానంపియె సమాజ[సి]

3. దో[స]మ్ దఖతి[।*] (V) అథిపిక[త]ఇయా సమాజాసాధు మతా దేవానం [పియస]పియ[ద]సినె లాజినె [।*]

4. (IV) పులె మహానససి దేవానంపి[య]స పియదసినె లాజినె అనుదివసం బహుని పానశత సహసాని [ఆల]

5. [భి] సు సూపాథాయె [।*] (VII) సె ఇదాని అ[దాఇయం] ధమ్మలిపి లిఖితా తద తి[ం]ని [యెవపా]నాని ఆలభియంతి [దువెమ జూలా]

6. ఏకె[మ]గె[।*] (VIII) సేపి [మ] గె నొధువం[।*] (IX) [ఎ]తాని పి చు తి[ం]ని పానాని పఛనో ఆలభి సంతి[॥*][1]

1. ఈ అనుశాసనమునకు దీని తర్వాత దానికిని నడుమ చిన్న గీత గలదు.

## మొదటి శిలానుశాసనము

### అనువాదము

1. ఈ ధమ్మశాసనము దేవానంప్రియుడు ప్రియదర్శియైన రాజాజ్ఞచే లిఖింపబడినది.
2. ఇచ్చట ఏ సజీవ ప్రాణిని బలి ఇవ్వకూడదు.
3. ఇచ్చట ఏ విధమైన వేడుక సమూహము కూడ నిషిద్ధము.
4. అట్టి సమావేశములవలన హానికల్గునని దేవానాంప్రియుని అభిప్రాయము.
5. అయినను ఒక్కరకమైన సమావేశము మాత్రమే దేవానంప్రియ ప్రియదర్శి మనస్సునకు మంచిదిగ తోచుచున్నది.
6. ఆహారముకొరకు ప్రియదర్శి దేవానంప్రియుని మహానసమందు వంటయింటిలో ప్రతిదినము వేలాది జంతువులు వధింపబడెడివి.
7. ఈ ధమ్మలిపి వ్రాయించునాటికి రాజప్రాసాదమున రోజుకు మూడు జీవులు - ఒక జంతువు రెండుపక్షులు - మాత్రమే మాంసాహారముకొరకు చంపబడెడివి.
8. ఈ జీవులు కూడ ప్రతిదినము వధింపబడుటలేదు.
9. ఇకనుండి ఇవికూడ చంపబడవు.

# రెండవ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

(ఇది మొదటిదాని క్రిందుగనే 'A' గండశిలపై వ్రాయబడియున్నది)

1. (I) సవతా విజితసి దేవానంపియస పియదసినె లాజినె ఎ చ అంతా అథా[చో]డ పాండియా సాతీక[పుతె తంబపంని అంతియో]

2. గె[నామయోన లాజా] ఎ చ అమ్నెతస[సామంత]అంతియోగస లాజినో సవతా దేవానంపియ[అ]పియదసినె[లాజినెదు][వె] [చికిసా]

3. కటా మని[సా] చ పశు చికిసాచ[।] (II) ఒసధాని[చ మనిసో] పకా[చ] పశు ఓపకా చ అత అతా నథి సవత [హాలాపితా చ లోపాపి]

4. తా చ[।*] (III) హెమెవ[మూలాని చ] ఫలాని[చ సవత] అత అత నథి[హా] లాపి[తా]చ లోపాపితా చ [।*] (IV) మగెసు లుఖాని లోపాపితాని ఉదుపానాని చ

5. ఖా[నా]పితాని పతి భోగాయె పసుమనిసానాం[।*]

## రెండవ శిలానుశాసనము

### అనువాదము

1. దేవానాంప్రియ ప్రియదర్శి రాజ్యములో నెల్లెడలను వారి సీమావధులావలి రాజ్యములైన చోడ, పాండ్య, సతీకపుత్ర, తామ్రపర్ణి రాజ్యములలోను, అటులనే యవన రాజైన అంతియోకుని, అతని పొరుగు రాజులైనవారి రాజ్యములలోను; రాజైన ప్రియదర్శి దేవానంప్రియుడు మనుష్యులకు, పశువులకును రెండు విధములైన వైద్య సౌకర్యములు కల్పించెను.

2. మనుష్యులకు, పశువుల వైద్యమునకు, కావలసిన ఓషధులులేని ప్రదేశములందు వాటిని తెప్పించి, నాటించు ఏర్పాట్లు గావించెను.

3. అదేవిధముగ, ఫలములు, మూలికలులేని ప్రదేశములందు వాటిని తెప్పించి నాటించు ప్రయత్నములు చేసెను.

4. రహదారుల కిరువైపుల మార్గాయాసమును పోగొట్టుటకై వృక్షములునాటించి, బావులు త్రవ్వించి, మనుష్యులకు, పశువులకు సుఖము చేకూర్చెను.

# మూడవ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

('A' గండశిల తూర్పుముఖము కుడివైపు సగభాగము)
(ఇది మొదటి శిలానుశాసనమునకు కుడిభాగమున వ్రాయబడియున్నది.)

1. (I) [దేవానంపియె] పియ[దసి] లాజహెవం ఆహా[।*] (II) దువాదశ వసా ఖిసితేన[మె]ఇయం ఆనవయతి
2. (III) [సవత] విజితె మమయుతా లాజూకె పాదెసికె [చ] పంచసు పంచసు చ వాసెసు అనుసంయానం నిఖమంతు
3. యేతాయె అథాయ ఇ[మా]యె ధమ్మాను సథీయే అథా అంనాయెపి కంమనె[।*] (IV) సాధు మాతాపితు సిసుసా[।*]
4. (V) మితసంథుత నాతికానం చ సమన బమ్హనానం చ సాధుదానె[।*] (VI) పానానం అనాలంభె సాధు [।*] (VII) అపవియ యతా[అ]ప ఖండత[ం]
5. సాధు[।] (VIII) పలిసాపిచా గన్నసియుతాని అసపయిసంతి హెతుతి చ వియంజనతెచ[।*][1]

1. ఈ పంక్తికడ చిన్నగీత ఆరవ అనుశాసనమును దీనినుండి వేరుచేయుటకుగాను చెక్కబడినది.



మూడవ, ఆరవ, పదునాల్గవ శిలానుశాసనములు. ('A' గండశిల తూర్పుముఖము కుడిప్రక్కవైపు సగభాగమున వ్రాయబడినవి.)

## మూడవ శిలానుశాసనము

### అనువాదము

1. రాజు ప్రియదర్శి దేవానాంప్రియుడీరీతి పల్కెను.

2. రాజ్యాభిషిక్తుడనైన పన్నెండు వత్సరముల తర్వాత ఆజ్ఞల నిచ్చితిని.

3. నా రాజ్యమంతటను రాజోద్యోగులైన రజ్జుకులు, ప్రాదేశికులు ప్రతి అయిదు సంవత్సరముల కొకసారి తమ పాలిత ప్రాంతమంతయు ధర్మ ప్రచారణార్థము తిరుగవలయును.

4. మాతాపితరు లాజ్ఞానువర్తియైనవాడు కడు ధన్యుడు.

5. స్నేహితులకు, పరిచితులకు, బంధువులకు, శ్రమణులకు, బ్రాహ్మణులకు తన ధనమును దానమొనర్చుటవలన పుణ్యము కలుగును.

6. అహింసవలన లేక పశువధనిషేధమువలనకూడ పుణ్యము గల్గును.

7. విరివిగ వెచ్చించకుండుట, ఎక్కువగ సంపదను కూడబెట్టకుండుటకూడ పుణ్యప్రదమే.

8. మంత్రిమండలి, రాజోద్యోగులందరును నేను చెప్పిన పై నిబంధనలను మనోవాక్కాయకర్మల ఆచరించునట్లు ఆజ్ఞాపింపవలెను.

# ఆరవ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

(ఇదికూడ 'A' గండశిలపై తూర్పుముఖమున మూడవ అనుశాసనమునకు క్రిందుగా చెక్కబడియున్నది.)

1. (I) [దేవానంపియె] పియదసి లాజా హేవం ఆహా [।*] (II) [అతికంతం అతలం] నొహూతపులువె సవం కాలం అథకంమె పతి వెదనా[వా] [।*] (III) సె మమయా హేవంకటె [।*] (IV) [సవం] కాలం

2. [అదమానసా ఓ] లొధనసి [గ ఛాగాలసి] [వ] చసి వినితసి యుయానసి సవతాపతి వెద[కా] అ [థం] జ [నస] పతి [వె] దయంతు మె [।*] (V) సవతా చ [జనస] అ [థం]

3. [కఛామి హకం] [।*] (VI) [యం] పి [చ కఛి ము] ఖతె అ[నప] యామి హకం దా[ప]కం వా సావకం వా [ఎ] వా మినా మహామాతేహి అతి యాయికె ఆలోపితె హోతితాయె అథాయె

4. [వివాదె] నిఝతి [వ]సంతం పాలిసాయె[అనంతలి] యెనా[ప]టి వెదత వియమతె మె[సవతా] సవం కాలం [।*] (VII) హేవం ఆనపయితె మమయా [।*] (VIII) నథిహి మె తొసె ఉథానసి

5. అథ స [ం]తి[లనాయ చ] [।*] (IX) కటవియ మతె[హి మె సవలొకహితె] [।*] (X) [తస] చ మినయె సమూలె ఉథానె అ[థ] సంతిలనా చ [।*] (XI) నథిహి కమ్మతలె సవలోకహితెన [।*] (XII) అంచకిఛి

6. పలకమామి హకంకితి భూతానం ఆననియె యెహం హిదె చ కానిసుఖాపయామి పలతా చ స్వగం [ఆ] లాధయతు [।*] (XIII) సె ఎతాయె[1] ఇయంధ [మ్మలిపి] [లె] ఖితా చిలఠితిక హోతు

7. తథా చ మె పుత-నతాలె పలకమ్మంతు సవలోక హితాయె [।*] (XIV) దుకలె చు ఖో ఇయం అమ్న [తా] అగెనాపల కమ్మెనా [।*]

1. 'అథాయె' అనుమాట లుప్తమైనది.

## ఆరవ శిలానుశాసనము

### అనువాదము

1. రాజు ప్రియదర్శి దేవానాం ప్రియుడీ విధముగ పల్కెను.

2. ఇతఃపూర్వము రాజకార్యములను చేయుట, రాజునకు ఆయాయి విషయములు ఎల్ల వేళలందు తెల్పుట ఉండెడిదికాదు.

3. అందులకై నేనీ నిబంధనము చేయుచున్నాను.

4. ఇకమీదట నేను భోజనముచేయునప్పుడు, అంతఃపురమందున్నను, శయ్యాగృహమునందున్నను, వాహ్యాళికి వెళ్ళినప్పుడును, వాహనములలో పయనించునప్పుడును, జైత్ర యాత్రలోనున్నప్పుడు కూడ ఈ యా వేళయను నియమము లేక ప్రజలయొక్క అవసరములను దూతలు నాకు వినిపింపవలయును.

5. నేను ప్రజల కార్యములను అన్ని వేళల అన్ని ప్రదేశములందు చూచుచున్నాను.

6. నేను స్వముఖతః ఏ దానముగాని ఆజ్ఞలనుగాని చేసినప్పుడు, మహామాత్రులు అత్యవసర కార్యములను చక్కబెట్టవలసినప్పుడు, ఆ కార్యాచరణలలో మంత్రి మండలిలో భేదాభిప్రాయము లేర్పడినప్పుడు, ఆయా విషయములను వెంటనే (నేనెచటనున్నను, ఎట్టి పరిస్థితిలోనున్నను) నాకు నివేదించవలెను.

7. ఇది నా ఆజ్ఞ.

8. రాజకార్యముల నిర్వహణలో నేనెప్పుడూ ఉదాసీనత వహించలేదు.

9. సర్వమానవుల సంక్షేమమే నా విధి.

10. దీనికి దీక్షతో సత్వర కార్యనిర్వహణ మత్యవసరము.

11. మానవ సంక్షేమముకన్న మించిన విధి నాకింకొకటి లేదు.

12. నా ప్రయత్నములన్నియు, సర్వజీవరాసులకు సుఖమొనగూర్చి తద్వారా వారి కిహపరములను కూర్చి నా ఋణము తీర్చ ప్రయత్నించుచున్నాను.

13. ఆ ఆశయముతోనే నేను శిలలపై ఈ ధమ్మలిపులను చెక్కించుచున్నాను. అనుశాసనములు ఆచంద్రార్కము స్థిరముగ నుండి మద్వంశజులైన నా కుమారులను, మనుమలను ప్రజాశ్రేయస్సునకై పాటుపడునట్లు ఉత్తేజపరువ గలవని నా నమ్మిక.

14. ఈ ఆశయసిద్ధి కష్టతరమైనది.

# పదునాల్గవ శిలానుశాసనము

## (ప్రాకృతమూలము)

('A' గండశిల తూర్పుముఖమున పైభాగములో కుడివైపు కోణమున చెక్కబడియున్నది.)

1. (I) ఇయం ధంమ్మలిపి దెవానంపియెన పియదసినా లాజినా
2. లి(ఖా)పితా[।*] (II) [అథియేవ సం[ఖి]తెన అధిమఝిమెన అధి విథ
3. [తెన] [।*] (III) నొహి సవతా స[వె]ఘ[టి]తె చ [।*] (IV) మహాల కెహి విజితె బహు చ
4. లిఖితె లిఖాపయిసామి ఛెవనికాయం [।*] (V) అధి చు పొత పున పున ల
5. [పితె తస తస] అఠస మాధు లియాయె యెన[జ]తె[నె]తథా
6. [పటిప జెయా] [।*] (VI) [సెసియ అతకి] ఛి అసమతి లిఖితె
7. దెసం వా సం[ఖా] సంఖాయాయా కాలనం వ ఆలొచయితు
8. లిపిక [లాపలా] ధెన వా తి [।*]

# పదునాల్గవ శిలానుశాసనము

## అనువాదము

1. ధర్మమునకు సంబంధించిన ఈ లిపి ప్రియదర్శి దేవానాంప్రియునిచే వ్రాయింపబడినది.

2. సాధారణముగ ధర్మసూత్రము వ్రాయునప్పుడు సూత్రములు సంక్షిప్తముగను మధ్యరకముగను విపులముగను వ్రాయుటకలదు.

3. కాని సూత్రములన్నియు ఒక్కచో వ్రాయబడలేదు.

4. నా రాజ్యము విశాలమైనది. చాల ప్రదేశములలో ధర్మసూత్రములు వ్రాయబడినవి. అయినను పలుచోట్ల నేను ఈ ధర్మసూత్రములను వ్రాయింపదలచితిని.

5. కొన్ని విషయములు ఇంపై ప్రజల ఆచరణార్థము తరచుగ చెప్పబడినవి.

6. ఆయా ప్రదేశముల కనవసరమని తోచినప్పుడును, సంక్షిప్తముచేయు ప్రయత్నము నందునను, లేఖకుని పొరపాట్లవల్లను ధర్మసూత్రములలో కొన్ని అసమగ్రముగ లిఖింపబడినవి.

# [శిలానుశాసనములు 11, 5, 7; 'A-1' ('A' గండశిల ఉత్తరపుముఖము) పై చెక్కబడియున్నవి]

## పదునొకొండవ శిలానుశాసనము

### (ప్రాకృత మూలము)

1. (I) దెవాన[ం]పియె హెవం ఆహా [।*] (II) నథి యెదిసె దానె అదిసె ధమ్మ దానె ధమ్మసంథవె

2. ధమ్మ సవిభాగె ధమ్మసంబధె [।*] (III) త [సి] యెస దాస భ [టక] సిసమ్మా పటిపతి మాతాపితు సుసూస

3. మిత సం[థు]త నాటికానం సమన బమ్హనాన[ం] దా[నె] పానానం అనాలంభె [।*] (IV) యెస వతవియె పితినాపి

4. [పు] తెన పి భా[తి]నాపి సువామికె [న]పి మితసంథుతెన పి ఆపటి వెసియెనా [పి] ఇయంసాధు ఇయంకటవియె[।*]

5. (V) సెతెనతథ కలంతు హిదలొకె చ కం ఆల[ధెహొ]తిపాలత చ అనంతం పునం పసవతి తేన ధమ్మదా

6. నెనా [।*]

# పదునొకొండవ శిలానుశాసనము

## అనువాదము

1. దేవానాంప్రియుడీ విధముగ చెప్పెను.

2. ధర్మమునకు మించిన దానములేదు. ధర్మముద్వారా ఏర్పడిన సంయోగమును, ధర్మాధర్మ విచక్షణ, ధర్మమువలన నేర్పడిన బంధుత్వమునకు మించినవి లేవు.

3. సేవకులను, బానిసలను కరుణతో చూచుట, మాతాపితృలకు శుశ్రూషచేయుట, బంధువులకు, స్నేహితులకు, బ్రాహ్మణులకు, శ్రమణులకు దానములు చేయుటయే ధర్మము.

4. ఈ ధర్మమాచరించువానికి తండ్రిగాని, కొడుకుగాని, అన్నగాని, స్వామిగాని, ఇరుగుపొరుగువారుగాని, అతడు చేయునది పుణ్యమని, చేయదగినదనియు చెప్పవలెను.

5. ఈ కార్యాచరణములవలన ఆనందమును ఇహలోక సౌఖ్యమునుపొంది పుణ్యాత్ములై ధర్మదానముతో పరలోక సౌఖ్యమునుగూడ పొందుదురు.

## ఐదవ శిలానుశాసనము

### (ప్రాకృత మూలము)

('A-1' గండశిల మధ్యభాగమున చెక్కబడినది)

1. (I) దేవానంపియె పియదసి లాజా హేవం ఆ[హా] [।*] (II) కయానెదు కలె[।*] (III) ఎ ఆదికాలె కయానస సెదు కలంకలెతి[।*] (IV) సె మమయా బహుకయానెకటె[।*] (V) [త]మమపు[త]న తాలె[పలంచ తెహిఆప]తియెమె

2. ఆవకపం తథా అనువతిసంతి సె సుకటం కచ్ఛంతి [।*] (VI) యె చు హేతా దెశంపి[హా] పయిసంతి సెదుకటం కచ్ఛతి [।*] (VII) పాపెహి నామ సుపదాలయె[।*] (VIII) సె అతకంటం అంతలం నొహుతపు[లు] వె[ధ]మ్మ [మహామ]తా [నామ] [।*]

3. (IX) సె తెదస వసాభిసితెన మమయ ధమ్మ మహామాతా నామకట [।*] (X) తె సవ పాసందెసు వియాపటా ధమ్మాథిథానాయె చ ధమ్మవథియా హిత[సుఖా] యె చ ధమ్మయుతస యో[న] కంబొాచ గం[ధా]లా[న]ం లఠిక పె

4. తినికనం[యె]వాపి అంనె అపలంతా [।*] (XI) భటాం అయేసు బంభనిభియెసు అనాథెసు వుథెసు హితసుఖాయె ధ[మ్మ]యుతానం అపలిబొాధాయె వియాపటతె[।*] (XII) బంధన బధ సపటి విధానాయె

5. అపలిబొాధాయె మొఖయె చ ఇయం అనుబంధ పజ[వ] [తి] వాకటాభి కాలెతి వా మ[హా]లకెతి వావియాప[టా]తె [।*] (XIII) హిదా బాహిలెసు చ నగలెసు సవెసు[చ] ఒలొాధనెసు భాతినం[పి చ మె భగినినం చ]

6. యెవాపి అంనె[నా]తికె సవత నియాపత[।*] (XIV) యె ఇయం ధమ్మనిసితెతివాధమ్మ అధిథానె తి వా దానసయుతె[తి]వా సవత విజితాసి మమధమ్మ యుతసి వియాపతా తెధమ్మమ[హా] మా[తా] [।*] (XV) యెతాయె అ[థాయ]

7. ఇయం ధమ్మలిపి లిఖితాచిలఠితిక హొాతు తథా చ మె పజా అనువతతూతి [।*]

# ఐదవ శిలానుశాసనము

## అనువాదము

1. దేవానంపియ ప్రియదర్శి మరియు నిటు వివరించెను.
2. ఇతరుల కెల్లప్పుడు మంచిచేయుట కష్టము.
3. పరోపకార కార్యము లారంభించి చేయువారు కష్టసాధ్యమైనను దాని యందు కృతకృత్యులౌదురు.
4. నావలన ఎన్నియో సత్కార్యములు చేయబడినవి.
5. నా తర్వాత నా కుమారులు, మనుమలు, వారి సంతతి కల్పాంతమువరకు కూడా నా మార్గమునే అనుసరించునో వారి పుణ్య మభివృద్ధిచెందును.
6. అట్లుగాక ఇందుకు భిన్నముగ ప్రవర్తించినచో పాపమును పొందుదురు.
7. పాపకార్యములాచరించుట బహు సులభము.
8. ఇతః పూర్వము ఎచ్చటను ధర్మమహామాత్రులనబడు రాజోద్యోగులు లేరు.
9. అందుకొరకే నా అభిషేకానంతరము పదమూడు సంవత్సరముల తర్వాత ధర్మ మహామాత్రులను ఉద్యోగులను నేనే నియమించితిని.
10. ఈ ఉద్యోగుల ముఖ్యవిధి వివిధ మతానుయాయులలో ధర్మ ప్రబోధము, ధర్మ నిర్వహణ, ధర్మ చింతన, కుల సంరక్షణాదులు నా రాజ్యములోనే గాక పొరుగుననున్న యవన, కాంభోజ, గంధార రాజ్యములలో నివసించు రాష్ట్రిక, పైత్ర్యాణికాది జనులలోకూడ తమ విధులను నిర్వర్తించవలెనని నా ఆదేశము.
11. వీరు రాజోద్యోగులు, ఆర్యులు, బ్రాహ్మణులు, పాలకులు మొదలగువారి యోగ క్షేమములు చూచుటెగాక, దీనులు, అనాధులు, వృద్ధులైన ధర్మాధర్మ నిర్ణయము చేయువారి బాధలనుకూడ నివారింప పాటుబడెదరు.
12. వీరు శిక్షల ననుభవించు ఖైదీల సంసారములకు వలయు ధనమును పంచిపెట్టుట ఇతరుల ప్రోద్బలము వలన నేరములను చేసి శిక్షననుభవించువారికి విముక్తి గల్గించుట, వయోవృద్ధులకు వలయు సహాయముకూడ చేయుచుండుట మొదలగు పనులను చేయవలయును.
13. ఈ ఉద్యోగులు నా రాజధాని (పాటలీపుత్రము)లోను, నా తోబుట్టువుల, బంధువుల గృహములలోను కూడ ఈ విధులు నిర్వహింతురు.
14. ఈ ధర్మమహామాత్రులు నా సువిశాల రాజ్యములోనెల్లెడల ధర్మనిరతుల స్థితి గతులను విచారించెదరు. ధర్మచింతన, ధర్మనిష్ఠ, దాతృత్వాది గుణములను ప్రజలలో గుర్తించుట వీరి విధులలో నొకటి.

15 ఈ ధర్మానుశాసనము ఆచంద్రార్కముగ నుండగలదని, నా సంతతివారు నా కోరికల మేరకు నడచుకొనగల్గుటకై నేను వీనిని రాతిమీద చెక్కించితిని.

# సప్తమ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

(గండశిల పై భాగమున కుడిచివర చెక్కబడినది)

1. (I) దెవానంపియె పియదశి లాజ సవత ఇచ్ఛతి
2. సవె పాసంద వసెయు [।*] (II) సవెహి తె సయమం భావసుధిచ
3. ఇచ్ఛంతి [।*] (III) జనెచు ఉచ్చా ఉచ్ఛ ఛందె ఉచ్చమంగలె [।*] (IV) తెసవం ఎకదెశం
4. పి కచ్ఛంతి [।*] (V) విపులె పి చు దానె అసనథి సయమె బావసుధి కిటనట చ
5. దిధ భతితా చ నీచ బాఢం [।*]

# సప్తమ శిలానుశాసనము

## అనువాదము

1. రాజు దేవానాంప్రియ ప్రియదర్శి సర్వమతానుయాయులు తన రాజ్యములో సుఖముగ జీవించవలెనని కోరుచున్నాడు.

2. వారు కూడ శమ దమాదులు గల్గి భావశుద్ధిని కోరెడువారె.

3. కాని ప్రజలలో తరతమ భేదములుండును.

4. కొందరు తమ విధులను పూర్తిగ నిర్వర్తించెదరు ; కొందరు అసంపూర్తిగ నిర్వహించెదరు ; మరికొందరు మధ్యలోనే పరిత్యజించెదరు.

5. ఎంతటివారైనను ఇంద్రియ నిగ్రహము, భావశుద్ధి, భక్తితత్పరత, లేక చేసిన కార్యములు నిష్ఫలము లగును.

## శిలానుశాసనములు 4, 8, 10

(‘B’ గండశిలపై కుడిభాగమున చెక్కబడియున్నది.)

### నాల్గవ శిలానుశాసనము

(ప్రాకృత మూలము)

1. (I) [అతి]కం[తం] అ [ం]తలం బహుని [వసస] తాని వధితెవా
2. [పానాలంభె] విహిసా చ భూతానం నాతినం [అ] సంపతి పతి
3. సమన బంభనానం అ [సంపతిపతి] [।*] (II) సె [అజ] దెవానంపియస
4. పియదసినె లాజినె ధమ్మచలనేన ఖెలిఘోషె అహో ధమ్మ ఘోషె [।*]
5. (III) విమాన దసనాచ హథిని అగికంధాని అంనాని చదివియాని లూపాని
6. దసయిత్వా జనస ఆదిసె బహుహి వసస తెహినోహుత పూల్వెతాదిసె
7. అజావధితె దెవానంపియస పియదసినె లాజినె ధమ్మ అను సధియా
8. అనాలంభె పానానం అవి [హి] సా భూతానం నాతినం [సంపతి] పతి సమన బంభనానం
9. సంపతిపతి మాతాపితు సుసూసావుధ సుసూసా [।*] (IV) ఎస అంనెచ బహు విధె ధమ్మ చలనె వధితె
10. వధయిసతి యెవ చ దెవానం పియ పియదసి లాజ ఇమం ధమ్మ చలనం [।*] (V) పుతా [చకం] న తలెచ [పా] నాతికాచ
11. దెవానం పియస పియదసినె లాజినె వధ ఇసంతి ఎవ ధమ్మచలనం [ఇమం] ఆవ [కపం] ధమ్మసి సీలసి చ చిథ్థితు
12. ధమ్మం అనుసాసిసంతి [।*] (VI) ఎసహి సెథు కమ్మం ధమ్మానుసాసన [।*] (VII) ధమ్మ చలనేపి చనోహోతి అసీలస [।*] (VIII) సె ఇమస అధస
13. వధి అహిని చ సాధు [।*] (IX) ఏతాయె ఇయం లిఖితె ఇమస అథస వధియు జంతు హీనిచ మా ఆలోచ ఇసయిసు [।*] (X) దువాదస వసా
14. ఖిసితెన దెవానం పియెన పియదసిన లాజిన ఇయం లిఖితె [।*].



నాల్గవ, ఎనిమిదవ. పదవ శిలానుశాసనములు. ('B' గండశిలపై కుడిభాగమున చెక్కబడియున్నవి.)

# నాల్గవ శిలానుశాసనము

## అనువాదము

1. ఇంతకు పూర్వము వందలాది సంవత్సరములనుండి మారణహోమములు, జంతుహింస, బంధువుల, శ్రమణుల, బ్రాహ్మణుల నిరాదరణ ఎక్కువగా యుండెడిది.

2. ఇప్పుడు దేవానంప్రియ ప్రియదర్శి ధర్మానుష్ఠాన ఫలితముగ భేరీఘోషలు ధర్మఘోషలుగ మారినవి.

3. బలులు, ప్రాణిహింసలు తగ్గిపోయి, పెద్దలయెడ, వృద్ధులయెడ శ్రమణులు, బ్రాహ్మణులు, తల్లిదండ్రులయెడ భక్తిశ్రద్ధలు ప్రియదర్శి ధర్మానుశాసనముల వలన తత్పూర్వము వందలాది సంవత్సరముల దైవరథ, గజ, అగ్ని, స్కందాది దైవ చిహ్న దర్శనములకన్న మెండుగ వృద్ధిచెందినది.

4. రాజు ప్రియదర్శి ధర్మాచరణములవలన ప్రజలలో ధర్మానురక్తి ప్రబలి ధర్మ వృద్ధిచెందుచున్నది.

5. రాజు ప్రియదర్శి పుత్రులు, పౌత్రులు, ధర్మానురక్తులై ఆకల్పాంతము ధర్మాచరణము చేయుచు ప్రజలకు ధర్మబోధ చేయుదురుగాక.

6. ధర్మబోధను మించిన స్వధర్మము మరియొకటి లేదు.

7. సత్శీలురు కానివారికి ధర్మాచరణ, బోధ సులభములుగావు.

8. కాన ధర్మ విషయమున నది వృద్ధియగుటకు మాత్రమె కాక, క్షీణింపకుండుటకు కూడ పాటుపడవలెను.

9. ఈ శాసనము ద్వివిధాశయములకై వ్రాయింపబడినది. (1) ధర్మాచరణము (2) ధర్మగ్లాని నిరోధము.

10. ఈ శాసనము దేవానంప్రియ ప్రియదర్శి అభిషేచనమై 12 సంవత్సరముల తర్వాత వేయించబడినది.

# ఎనిమిదవ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

('B' గండశిల మధ్యమందు చెక్కబడియున్నది)

1. (I) అతికంతం అంతలం దెవానంపియా విహాలయాతం నామనిఖమిసు [।*] (II) హెతమిగవియా అంనాని చ హెదిసాని ఆభిలమని

2. [హూసు] [।*] (III) సె దెవానంపియె పియదసి లాజ దసవసాభిసితే సంతం నిఖమిథ [సంబోధి] [।*] (IV) తెన త ధమ్మయాతా [।*] (V) హెత ఇయం హోతి

3. సమన బంహనానం దసనె దానె చ వుధానం దసనె హిలంన పతివిధానె చ జాన పదస జనసదసనె ధమ్మానసధి

4. ధమ్మపలిపుచ్ఛ తదోపయా [।*] (VI) ఎషభూయెలతిహోతి దెవానంపియస పియదసినె లాజినె [।*] (VIII) భాగె అంనె [।*]

# ఎనిమిదవ శిలానుశాసనము

## అనువాదము

1. ఇతఃపూర్వము దేవానంప్రియ బిరుదాంకితులైన రాజులెల్లరు విహారయాత్రలకే వెళ్లెడివారు.

2. ఆ యాత్రలలో వారు ఎక్కువగ మృగయా వినోదులగువారు.

3. ఇప్పుడు ప్రియదర్శి దేవానంప్రియుడు తన అభిషేచనానంతరము పది సంవత్సరములకు సంబోధిని దర్శించెను.

4. తదాది ఈ ధర్మయాత్ర లారంభమైనవి.

5. ఈ ధర్మయాత్రలో శ్రమణబ్రాహ్మణుల దర్శనము వారికి దానాదు లొసంగుట, వృద్ధులగు వారికి ధనసహాయము చేయుట, పల్లెప్రాంతముల జానపదులను కలిసి కొని వారితో ధర్మచర్చ జరిపి ధర్మనిరతులచేయ ప్రయత్నించుట ముఖ్య కార్యములు.

6. ఈ కార్యాచరణము ప్రియదర్శిరాజుకు ఎక్కువ సంతోషము.

7. తదితరములన్నియు ఆతనికి సంమోదకరములు కావు.

## పదియవ శిలానుశాసనము

('B' గండశిల క్రింది భాగమున చెక్కబడినది)

1. (I) దెవానంపియె పియదసి లాజ యసో వా కితి వా నో మహత్థవహం మనతి అనంత తదాతాయె ఆయతి యా చ జనె ధమ్మసుసూసం

2. సుసుసతు మె ధంమయుతం చ అనువిధియతు [తి] [।*] (II) ఏతాకాయె దెవానంపియె పియదసి లాజ యసో వా కిత్తి వా ఇచ్ఛతి [।*]

3. (III) యం చు కిచ్ఛి పలకంతి దెవానంపియ పియదసి లాజ సవంతం పలతికా [యెవా] కితి సకలె అప పలిసవె సియాతి

4. తి [।*] (IV) ఎస చు పలిసవె ఏ అపునె [।*] (V) దుకలె [చు ఖో] ఎస ఖుదకేన వగెనా ఉసతెన వ అంనత అగెన పలకమెనా

5. సవం పలతిజితు [।*] (VI) హెత చు ఖో ఉసతెన ఎవదుకలె [।*]

## పదియవ శిలానుశాసనము

### అనువాదము

1. రాజు దేవానంప్రియ ప్రియదర్శి తన ప్రజలు భవిష్యద్వర్తమానములలో ధర్మబద్ధులై, తాను బోధించిన ధర్మములను తప్పక ఆచరించుచే తన కిహపరకీర్తిప్రతిష్ఠలకన్న మిన్నయని భావించెడివాడు.

2. ఈ విషయమునందే దేవానాంప్రియ ప్రియదర్శి కీర్తికాముడు.

3. దెవానంప్రియ ప్రియదర్శి రాజు తాను ప్రజలకు శాశ్వతమైన ఆనందమును కూర్చుటె పరమావధిగ వర్తించెడి వాడు.

4. తద్భిన్నకార్యములన్నియు పాపభూయిష్ఠములె.

5. ఈ పాప కార్యాచరణములవలన బీదలకు, ధనికులకుగూడ ఆనందము చేకూరదు గాన తద్భిన్నముగ ప్రవర్తించుటకు కష్టపడవలెను.

6. వీరిలో ధనికులకు ఇది కష్టతరము.

# పదమూడవ శిలానుశాసనము

## (ప్రాకృత మూలము)

(B-1 గండశిలపైన మరియు C గండశిలపైన చెక్కబడియున్నది)

1. (I) అఠ-వస-అభిసితస దెవానంపియస పియదసినె
2. లాజినె కలిగావిజితా[।*] (II) దియ ధమితె పానసతస
3. హసెతఫా అపవుఢె సతసహసమితె తత హతె బహు
4. తా[వత] కె[వా] మతె[।*] (III) తతొ పచ్ఛా అ[ధు]నా లధెసు కలిగెసు
5. [తివె] ధమ్మావాయె ధమ్మకామతా ధమ్మ అనుసథి చ దెవానంపియస [।*]
6. (IV) సె అథి[అ] [నుసయె] దెవానంపియస విజినితు కలిగాని [।*] (V) అ విజితం[హి]
7. విజినమనె ఎతత వధ వామలనెవ అపవహె వాజనస సెబాఢం వెదనియమతె
8. గులుమాతె చ దెవానంపియస [।*] (VI) ఇయాపి చు తతొ గులుయాతతలె దెవానంపియస
9. ఎ తత వసతి బా[భ]నావా సమానావా అంనె వా పాసండా గిహథావా పసు విహితా
10. ఎస అగభుతి సుసుసా మాతాపితుసుసు సా గులు సుసుసా మిత సంతు ధసహాయ
11. నాతికేసు దాస భటకేసి సమ్మాృపతి పతిదిఢ ఛతితా చ తెస తత హొతి ఉపఘాతెన
12. అభిలతానం ఖమనె [।*] (VII) యె సంవాపి సువిహితానం సినెహి అవిపహినె పతానం మితసం
13. థుత సహాయ నాతికె వియసనం పాపునాతి తతసె పితానమ్మేవ ఉపఘాతె హొతి[।*] (VIII) పటిభాగె చ ఎస
14. సవమనుసానం గులుమతె చ దెవానంపియస[।*] (IX) నథి చ సె జానపదె అతనథి ఇమె నికాయా అంనతా
15. యోనెసు బాభనె చ సమనె చ [।*] (X) నథి నథిచ కువాపిజనపద సి అతనథి మునిసానం ఎకతలసి పి.
16. పాసండసి నొ నామ పసాదె[।*] (XI) అసెఅవతకె జనె తదా కలిగెసుహతె చ మటె చ అపవుఢె చ తతొ సతభాగె వ
17. సహస భాగె వా అజ గులుమతెవా దేవానంపియస [।*] (XII) ఎ పి అజ అపక లెయ ఖమత వియమతె వ దెవానం పియెన



పదమూడవ శిలానుశాసనము ('B-1' గండశిలపైనను మరియు 'C' గండశిలపైన చెక్కబడియున్నది.)

18. యం సకియె ఖమితవె [।*] (XIII) ఆ పి చ అటవి దెవానం పియస విజతసి హొతి తం పి అనునయతి అనునిఝపయ

19. తి [।*] (XIV) అను తాపె పి చ పభావె దెవానంపియస ఉచతి తెసం కితి అవతపె యునొపిచ హంనె

20. యు [।*] (XV) ఇచ్ఛతి హి దెవానంపియె సవభూతానం అఛతి సయమం సామచలి

21. యం మాదవం [।*] (XVI) ఇయం చు మొఖ్యముతె విజయె దెవానంపియస ఏధం

22. మవిజయె [।*] (XVII) సెమన లధె దెవానంపియ పహిద [వా] బాఛసవె సూచ అంతెసు ఆససుయో

23. జనసతెసుఅంతియొకె నామ యొన లాజ పలంపితెనా అంతియొకెన ఛతాలి లాజినె

24. తులమాయె నామ అంతికెని నామ

25. మకా నామ అలికసుదలె నామ నితియం చోడ పాండియా ఆ తంబపనియె [।*] (XVIII) హెమెవహిద

26. లాజ విసవసి యొన కంభొచెసు నాభక నాభపంతిసు భోజ పితినికెసు అంధ పాలదెసు

27. సవత దెవానంపియస ధమ్మానుసధి అనువతంతి [।*] (XIX) అత పి దూతా దెవానం పియస నొయంతి

28. తెపి సుతు దెవానంపియస ధమ్మవుతం విధనం ధమ్మానుసధి

29. ధమ్మం అనువిధీయసంతి అనువిధీయ సంతి చెవ [।*] (XX) సెలధె ఎతకెన హొతి.

## (ఈ క్రింది 30-36 పంక్తులు 'C' గండశిలపై చెక్కబడినవి)

30. సవత విజయె సవధి పన విజయె పితిలసె సె [।*] (XXI) లధా సాపితి హొతి ధమ్మవిజ

31. యసి [।*] (XXII) లహుకా చు ఖో సా పితి [।*] (XXIII) పలతి కమ్మెవ మహాఫలమం నతి దెవానం

32. పియె [।*] (XXIV) ఎతాయె చ అధాయె ఇయం ధమ్మలిపి లిఖితా కితి పుత పపొ తా మె

33. అం నం నవం విజయం మావి జెతవియం మంనిసు సయకసి యెవ విజయసి

34. ఖంతి చ లహుదండతం చ లొచయంతు తమ్మెవచ విజయం మంనంతు ఏధం

35. మవిజయె [।*] (XXV) సెహి హిదలొకిక పాలలొకికె [।*] (XXVI) యావఛ కానిలతిహొతు

36. ఆధంమలతి [।*] (XXVII) సాహి హిదలొకిక పాలలొకికా [।*]

# పదమూడవ శిలానుశాసనము

## అనువాదము

1. దేవానంప్రియ ప్రియదర్శి అభిషేకానంతరము ఎనిమిది సంవత్సరములకు కళింగరాజ్యము జయించెను.

2. ఈ కళింగయుద్ధమున లక్షలాది పశువులు, మనుష్యులు ఖైదీలుగా గొనిపోబడిరి. లక్షకుపైగా సైన్యము యుద్ధమున మరణింపగా మిగిలినవారు ఇతర విధముగ నశించిరి.

3. ఈ మారణహోమానంతరము కళింగము జయింపబడినది. దేవానంప్రియుడు తదనంతరము ధర్మచింతన, బోధ, ధర్మజిజ్ఞాస కళింగ ప్రజలలో కలిగింప పూనుకొనెను.

4. కళింగయుద్ధమున జరిగిన ప్రాణనష్టమే దేవానంప్రియుని మనస్సు మారుటకు కారణము.

5. యుద్ధములు, తత్కారణముగ సంభవించు మారణహోమములు, దుఃఖము, జన సంక్షోభము, చెరపట్టబడినవారి ఆర్తనాదములనిన దేవానంప్రియుని కయిష్ట మేర్పడినది.

6. ఇంతకన్న దుఃఖ భూయిష్టమైనది జయించిన రాజ్యములలో నివశించు పుణ్యాత్ములకు పెద్దలయెడ, తలిదండ్రులయెడ భక్తిప్రపత్తులు కల్గినవారికి, స్నేహితులయందు గౌరవాభిమానములు, భటులయందు, బానిసలయందు, ఆదరమున్న పుణ్యాత్ములకు, ఇతర మతావలంబకులైన బ్రాహ్మణ, శ్రమణులకు కల్గిన గ్లానియని దేవానాంప్రియు డభిప్రాయపడెను.

7. ఇట్టి ఆపద తమకు రాకపోయినను తమ బంధువులకు, మిత్రులకు, వాటిల్లినను అవి తమకు కలిగినట్లే భావించెదరు.

8. యుద్ధములో ఈ కష్టములు భేదములేక ఎల్లరు అనుభవించెదరు గాన యుద్ధమనిన దేవానాంప్రియునకు విముఖత కల్గినది.

9. యవన రాజ్యములో తప్ప బ్రాహ్మణులు, శ్రమణులులేని రాజ్యములులేవు.

10. ఏదో ఒక మతమును అనుసరించని జనముండు దేశమేలేదు.

11. కాన కళింగయుద్ధములో చనిపోయిన, బందీలైనవారికి కల్గిన బాధలకు, శతాంశము, సహస్రాంశము ఉపశమనము కలిగింపవలయునని దేవానాంప్రియుడు మిగుల పాటుపడుచున్నాడు.

12. ఇప్పుడు దేవానాంప్రియుడు తనకెవడైన అప్రియ మొనరించిన, వీలైనచో శిక్షింపక, క్షమింపదలచును.



పదమూడవ శిలానుశాసనము (తరువాతి భాగము). ('C' గండశిలపై చెక్కబడియున్నది.)

13. తన రాజ్యములో నివశించు ఆటవికులనుకూడ శిక్షింపక ఆదరించి మంచిమార్గమున నడుచుట కుపదేశములు దేవానాంప్రియుడు చేయును.

14. దేవానాంప్రియుడు పశ్చాత్తప్తులైనను చెడ్డవారిని శిక్షించుటకు తనకు శక్తి కలదనియు కాని వారిని చెడుమార్గమునుండి తప్పించుటకె నేరస్థులైనను వారిని చంపుటలేదనియు తెలియపరచెను.

15. దేవానంప్రియుడట్టి వారియెడ క్షమ కలిగి, వారిని సన్మార్గవర్తనులుగ చేయుటకు తగిన దండోపాయము నుపయోగించి మంచి ప్రవర్తకులుగ పరివర్తితులను చేయుటయే రాజు అభిమతము.

16. కాన ధర్మ విజయమే అత్యున్నతమైనదని దేవానాంప్రియుడు భావించుచున్నాడు.

17. అటువంటి ధర్మ విజయములు దేవానాంప్రియుడు తన రాజ్యములోనే కాక, శతయోజనముల కావలినున్న యవన రాజైన అంతియోకుని, ఆతని దేశముల కావలపాలించు రాజ్యాధినేతలైన తులుమాయ, అంతికేని, మకా, అలికసుందరుల రాజ్యములలోను, దక్షిణమున తామ్రపర్ణి పర్యంతముగల చోడ, పాండ్యాది రాజ్యములలోని ప్రజలలోను గూడ ఈ ధర్మ విజయ ప్రశస్తిని తెలిపెను.

18. అదేరీతిని స్వరాష్ట్రములోని, యవన, కాంభోజ, నాభక, నాభపఙ్తుల దేశములలోను, భోజ, పైత్ర్యాణిక, అంధ్ర, పౌళిందాది రాజ్యములలోగూడ ప్రజలు ధర్మ మార్గానువర్తులై, దేవానంప్రియుని ఆదేశములను పాటించుచుండిరి.

19. దేవానాంప్రియుని దూతలు ప్రవేశించని రాజ్యములలోగూడ ప్రజలు ధర్మ సూత్రములు విని, పాటించుచున్నారట.

20. కాన ధర్మ విజయమున, జయించినవారు, పరాజితులు ఇరువురు కూడ సంతుష్టులుగ నుందురు.

21. ధర్మ విజయమున ఇరుకక్షుల వారికి గూడ తృప్తి చేకూరుచున్నది.

22. కాని ఆ తృప్తి అంత ప్రశస్తము కాదు.

23. ప్రజలకు లభించు పారలౌకిక సుఖమే ప్రశస్తమని దేవానాంప్రియుని అభిప్రాయము.

24. ఏతత్కారణమునసె దేవానాంప్రియుడు శిలలపై ఈ ధర్మానుశాసనములు చెక్కించి తన తదనంతరము తన పుత్ర పౌత్రులు రాజ్య విస్తరణ కాంక్షలేకుండ, శాంతికాముకులై యుద్ధము లనివార్యములైనచో పరాజితులయెడ క్షమ, సహనత, సౌశీల్యము, మొదలగు సుగుణములను ప్రదర్శించి, తగుమాత్రపు దండన విధించుట, మొదలగువాటితోగూడిన ధర్మవిజయమే నిజమైన విజయమని తెలియజేసెను.

25. అట్టి విజయమే ఎల్లరకు, ఇహపర సౌఖ్యమును కల్గించును.

26. ధర్మమువలనకలుగు ఆనందమె నిత్యమైనది.

27. ఏలనన అది ఇహపరసౌఖ్యములకు మూలాధారము.

## పండ్రెండవ శిలానుశాసనము
## (ప్రాకృత మూలము)
### ('D' గండశిలపై చెక్కబడియున్నది)

1. (I) దెవానంపియె పియదసి లాజా సవపాసండాని పవజితాని

2. [గిహథాని వ పూజయతిదానె]న వివిధాయ చ పూజయా[।*] (II) నొ చు తథా దానంవ

3. [పూజా]వ దెవానంపియె మంనతి అథ[కితిసాలవఢి] సియా సవపాసండానం [।*] (III) సాలవ

4. ఢి చు బహువిధా[।*] (IV) తస చు ఇయం మూలె అ వఛగుతి కితి అత పాసండ పూజావ పల పాసండగలహా

5. [వా నొ]సియా అపకలినసి లహుకావసియా తసితసి పలకనసి [।*] (V) పూజె తనియ వ చు పల పాసండా తేన తెన

6. ఆకాలెన [।*] (VI) హెవం కలంతం అతపాసండం బాఢం వఢయతి పల పాసండస పి చ ఉపకలెతి [।*] (VII) తదంనథా కలంత

7. అత పాసండ చ ఛనతి పలపాసండస పి చ అపకలెతి[।*] (VIII) ఎ హికెచ్ఛి అత పాసండం వా గలహాతి

8. సవ అతపాసండ భతియా వా కితి అతపాసండం దిపయెమ [తి] సె చ మన తథా కలంతం బాఢతలె ఉపహంతి అతపాసండం [।*] (IX) సె సమ

9. వాయె [వా] సాధు కితి అంనం అనాస ధంమం సునెవు చ సుసూసెయు చ [।*] (X) హేవం హి దెవానంపియస ఇఛా కితి సవపాసండా

10. బహుసుతా చ కాయా నాగమా చ హువెయు తి[।*] (XI) యె చ తత తత పాసంనా తె హి వతవియె [।*] (XII) దెవానంపియె నొ తథాదానం వా పూజ వా మంనతి

11. అథ కితి సాలవాఢి సియా సవ పాసండానం తి[।*] (XIII) బహుకా చ ఎతాయె అథాయె లియాపటా ధంమ మహామాతా ఇథిథియఖ మహామాతా

12. వఛభూమికా చ అంనె చ నికాయ[।*] (XIV) ఇయం చు ఏతస ఫలె అతపా సండ వఢి చ హొతి ధంమస చ దీపనా తి [।*]



పన్నెండవ శిలానుశాసనము. ('D' గండశిలపై చెక్కబడియున్నది.)

# పన్రెండవ శిలానుశాసనము

## అనువాదము

1. దేవానంప్రియ ప్రియదర్శిరాజు సర్వమతస్థులను స్వపరభేదములేక దాన ధర్మాదులతో గౌరవించును.

2. ఐనను దేవానంప్రియుడు ఇట్లు తానుచేయు దానాది గౌరవముల కెక్కువ ప్రాధాన్య మివ్వక, ధర్మవృద్ధికి, ఎల్లప్రజలలో ధర్మచింతనకు ప్రాధాన్యత నిచ్చును.

3. ధర్మాంగముల వృద్ధికి మార్గములు పెక్కులు.

4. ఇందుకు అవసరానవసరములను గుర్తించి స్వమతమునందత్యంత అభిమానము పరమతములను దూషింపని మితభాషిత్వము ముఖ్యము.

5. ఎల్లవేళల పరమతస్థులయెడ అభిమానము చూపుట అత్యవసరము.

6. ఇట్లు నడచుటవలన స్వమతమున కాదరాభిమానములు పెంపొందింపజేయుటకు, పరమత పోషణకు కూడ వీలుకలుగగలదు.

7. తద్భిన్న వర్తనము స్వమతాయాతమునకు కారణభూతమగును.

8. ఎవ్వరైన తన మతమె శ్రేష్ఠమైనదనియు, అందువలన తానామతము నవలంబించితిననియు పల్కుచు పరమత దూషణముచేయునో వాడు తన మతముయొక్క పతనమునకే కారణభూతుడగును.

9. మాటలలో సంయమము వలన ఒకరిమీద మరొకరికి గౌరవాభిమానములు పెరిగి ధర్మచింతనకు దోహదమొనర్చును.

10. అందుచేతనె దేవానంప్రియుడు అందరిని ఎల్లమతముల మూలసూత్రములను గ్రహించి జ్ఞానోపార్జన చేయవలయునని కోరును.

11. ఇందుమూలమున సర్వమతానువర్తులకు తెలియజేయునదేమనగా :

12. దేవానాంప్రియుడు ప్రజలుచేయు దానధర్మములకు, గౌరవములకు ప్రాధాన్యతనీయక, ధర్మవ్యాప్తికి, ధర్మచింతనకు ప్రాముఖ్యమొసగును.

13. ఈ కార్యసిద్ధికై రాజోద్యోగులు ముఖ్యముగ ధార్మికవిషయముల పలుకుటకు మహామాత్రులు, అంతఃపుర విషయముల పర్యవేక్షించుటకు మహామాత్రులు, భూమికులు మొదలైనవారు నియోగింపబడిరి.

14. వారివలన నేను ఆశించునది ధర్మపరిరక్షణ మతానురక్తి ప్రచారము.

# తొమ్మిదవ శిలానుశాసనము

(ప్రాకృత మూలము)

('E' గండశిలపైని చెక్కబడినది)

1. (I) దెవానంపియె పియదసి లాజా హెవం ఆహా [।*] (II) జనె ఉచ్చావుచ్చం
2. మంగలం కలెతి ఆబాధసి వివాహసి ఆవాహసి పజుపదాయె [।*] (III) ఎతాయె
3. అంనాయె చ హెదిసాయె జనె బహు మంగలం కలంతి [।*] (IV) హెతా చు అంబక జనికా బహు చ బహువిధం చ
4. ఖుదా చ నిలథియం చ మంగలం కలంతి [।*] (V) సె కటవియె చెనఖో మంగలె [।*] (VI) అపఫలె చు ఖొ ఏసె [।*] (VII) ఇయం చు ఖొ
5. మహాఫలె ఏ ధంమమంగలె [।*] (VIII) హెతా ఇయం దాస భటకసి సంయా పతి పతిగులునె అపచితి పానానాం సయమె
6. సమన బంభనానం దానె [।*] (IX) ఎస అంనె చ హెదిసె ధంమ మంగలె నామ [।*] (X) సె వతవియె పితినాపి పుతెన
7. పి భాతికెన పిమిత సంతుథెన పి అవసటివెసియెన పి [।*] (XI) ఇయం సాధు [।*] (XII) ఇయం కటవియె మంగలె ఆవ
8. అధస నివుతియా నివుతసి వా మిన ఇమం కచ్చామి [।*] (XIII) ఎ హి ఇతలె మంగలె సంసయికె సె [।*] (XIV) సియా [వాతం]
9. అతా నివతయెయా సియా సె నొ [।*] (XV) హిదలొకికె చెవసె [।*] (XVI) ఇయం మిన ధంమ మంగలె అకాలికె [।*] (XVII) హెంచె పి తం
10. అఠం నొ నివతయతి హిద అధ పలిత అనంతం పుంనం పసవతి [।*] (XVIII) హెంచె మినాతం పి అధం నివతెతి హిద తతొ
11. [ఉభొ] లధె హొతి హిద చ సె అథె ఫలిత చ అనంతం పుంనం పసవతి తెన ధంమ మంగలెనా [।*]



తొమ్మిదవ శిలానుశాసనము. ('E' గండశిలపై చెక్కబడియున్నది.)

# తొమ్మిదవ శిలానుశాసనము

## అనువాదము

1. దేవానాంప్రియ ప్రియదర్శి ఈ విధముగ తెల్పెను.
2. జనులు అనారోగ్యముగ నున్నప్పుడు, గృహమందు వివాహాది శుభకార్యములు జరుగునప్పుడు, మంగళప్రదమైన క్రతువులను చేయుచుందురు.
3. ఆయా సందర్భములలో శుభాకాంక్షులై పుణ్యకార్యములు చేయుటకూడ కలదు.
4. అందు ముఖ్యముగ స్త్రీలు నిరుపయోగమైనట్టి, అర్థరహితమైనట్టి పనులెన్నో చేయుటకలదు.
5. శుభప్రదమైన కార్యములు తప్పక చేయవలసినదే.
6. కాని సాధారణముగ మనముచేయు కార్యములు తగినంత ప్రయోజనకరములు కావు.
7. ధర్మదీక్షతో చేయు క్రతువులే ఫలప్రదములు.
8. అవేమనగా భృత్యులను, సేవకులను తగినట్లు అభిమానించుట, పెద్దలను గౌరవించుట, జీవరాసుల యందాదరము, శ్రమణులకు, బ్రాహ్మణులకు శక్తికొలది దానముచేయుట.
9. ఇట్టి సత్కార్యములే ధర్మక్రతువులనదగినవి.
10. కాన ప్రతిమానవుడు, తన తండ్రికి, కుమారునకు, అన్నదమ్ములకు, స్నేహితులకు ఈ క్రిందివిధముగ తెల్పవలయును.
11. ధర్మమును బోధించు క్రతువె సత్క్రతువు.
12. ఈ పద్ధతిని తన ఆశయము సిద్ధించువరకు పట్టుదలతో సాధించవలయును.
13. ధర్మ వ్యతిరేక క్రతువులు, కర్మలు, కేవలము నిష్ప్రయోజనములు.
14. తద్వ్యతిరేకమైన కర్మలవలన ఫలము సిద్ధించవచ్చును, సిద్ధించకపోవచ్చును.
15. అట్టి కార్యముల ఫలములు ఈ లోకమునకు పరిమితములు.
16. ధర్మవిహిత క్రతువులు తద్భిన్నములై ఈ దేశ, కాలముల కతీతములైన ఫలము నిచ్చునవి.
17. అట్టి కార్యాచరణములవలన ఇహలోక సౌఖ్యములు లభింపకున్నను, అపారమైన పుణ్యము ప్రాప్తించును.
18. అటులనె ఒకవ్యక్తి కోరిన కోరికలు తీరినయెడల ఆతని ఇహ సౌఖ్యము పరలోకమునకు వలసిన పుణ్యము ధర్మకార్యాచరణములచే సిద్ధించుచున్నవి.

బౌద్ధ, పాలిగ్రంథములు అశోకుని రాజ్యాభిషేచనము బుద్ధుని మరణానంతరము 218 సంవత్సరములకు జరిగెనని తెల్పుచున్నవి. అశోకుని శాసనములలో ముఖ్యములైనవి ఆతని 12, 13, 14వ రాజ్యసంవత్సరములందు చెక్కింపబడినవి. అందు అతని సమకాలీనులైన గ్రీకురాజులు, అంతియోక, తులమయ, అంతికిని, మాగలపేర్లు ప్రస్తావించబడినవి. ఇందు అంతియోకసు, పశ్చిమాసియా, సిరియాలను క్రీ.పూ. 261–44 లలో పాలించిన రెండవ అంటియోకస్ థియోస్‌గను, తులమయను, రెండవ టాలమీ ఫిలడల్ఫస్ (క్రీ.పూ. 285–47) ఈజిప్టు పరిపాలకునిగను, మూడవరాజు అంతికినిని మాసిడోనియా ప్రభువు అంటిగోనస్ గోనస్‌గను, మాగను, సైరీని రాజైన మోగస్ (క్రీ.పూ. 300–250)గను చరిత్రకారులు గుర్తించినందున, వీరు అశోకచక్రవర్తి 14వ రాజ్య వత్సరమునాటి కాతని సమకాలీనులగుటవలన, వారి వారి పరిపాలనా కాలమునుబట్టి అశోకుని రాజ్య పట్టాభిషేక కాలము నిర్ణయించుటకు వీలగుచున్నది. క్రీ. పూ. 270–69 లలో అశోకుడు సింహాసనాధిష్ఠితుడయ్యెనని నిర్ధారణ చేసియున్నారు. ఆతని శాసనముల సహాయముతో అతని జీవిత విశేషములను ఈ క్రింది పట్టికలో నుదాహరించడమైనది:

| | |
|---|---|
| అభిషేచనము | క్రీ. పూ. 270–69 |
| కళింగ విజయము | 263–262 |
| అశోకుని బౌద్ధమత స్వీకారము | 261–260 |
| బారాబరు గుహాలయములను అశోకుడు ఆజీవకులకు దానమొసగుట | 259–256 |
| శిలాశాసనములు I–IV ల లేఖన కాలము | 259–258 |
| ధర్మమహామాత్రుల నియామకము | 258–257 |
| V–XIII శిలాశాసనముల లేఖనకాలము | 258–256 |
| 14వ శిలాశాసనము లేఖనకాలము | 257–256 |
| కొనాకముని స్థూప విస్తరణము | 257–256 |
| ఆజీవకులకు గుహాలయముల దానము | 252–251 |
| లుంబిని దర్శనము | 251–250 |
| 26వ రాజ్యవత్సరమున జైలునుండి ఖైదీల విముక్తి | 245–244 |
| ఎఱ్ఱగుడి, సహస్రాం, బైరత్, బ్రహ్మగిరి మొదలగు ప్రదేశములలో శిలాశాసనములు లిఖింపజేయుట | 245–244 |

బౌద్ధగ్రంథములలో అశోకుడు క్రీ. పూ. 285—284 సంవత్సరములలో ఉజ్జయినిని జయించెననియు, 285—73 మధ్యకాలములో అచ్చరాజప్రతినిధిగ నియమింపబడి, విదిశ నగర వైశ్యప్రముఖుని కుమార్తె దేవిని పరిణయమాడి, ఆమెవలన మహేంద్రుడను కుమారుని, సంఘమిత్రయను కుమార్తెను బడసెననియు, తండ్రి బిందుసారుని మరణానంతరము రాజ్యసింహాసనమునకై అన్నదమ్ములతోతలపడి, అశోక నామముతో క్రీ. పూ. 270—269 లో అభిషేకము చేసికొనెననియు చెప్పబడియున్నవి. రాజ్యమునకు వచ్చినప్పుడు రాజు బౌద్ధుడు కాడనియు, అన్యమతస్థులైన బ్రాహ్మణ, పండరంగ, పరివ్రాజక, ఆజీవక నిర్గ్రంథులాదిగ 60 వేలమందికి అన్నదానము చేయువాడనియు ఆ గ్రంథములు తెలుపుచున్నవి. అశోకుడు తన నాల్గవరాజ్యవత్సరమున బౌద్ధమతమును స్వీకరించి, 84,000 స్థూప, ఆరామములను నిర్మాణముచేసి బౌద్ధ భిక్షుకుల కొసగెనట! ఆ తర్వాత అతని తమ్ముడు తిష్య, మేనల్లుడు అగ్నిబ్రహ్మ బౌద్ధమతమును స్వీకరించి సంఘ ప్రవేశమొనర్చిరట. అశోకుని 6వ రాజ్యవర్షమున కుమారుడు మహేంద్రుడు, కుమార్తె సంఘమిత్ర సన్యసించిరి. క్రీ. పూ. 265—64 లో ప్రియదర్శి నామముతో అభిషిక్తుడాయెనని. 20వ రాజ్యవర్షమున ఆతని భార్య మరణింప తిష్యరక్షిత పట్టపురాణి యాయెనని, క్రీ.పూ. 234-33 లో అశోకచక్రవర్తి కీర్తిశేషుడాయెనని బౌద్ధమతగ్రంథములు తెల్పుచున్నవి. వాటిలో చెప్పబడిన అశోకుని జీవిత విశేషములలో ముఖ్యమైనవి అతని రాజ్యాభిషేచనము, బౌద్ధమతావలంబనము, ఏతత్ మతవ్యాప్తికై ఆతడొనర్చిన పుణ్యకార్యములు మాత్రమే. చక్రవర్తిలో మానసికవ్యథ కల్గించి యుద్ధవిముఖత కల్గించి ధర్మ మార్గానువర్తిని చేసిన కళింగయుద్ధ ప్రస్తావన ఇందు కానరాదు. బౌద్ధగ్రంథములలో చక్రవర్తిగా రాజ్యాభిషేచనమునకేల ఇంతటి ప్రాధాన్యత నిచ్చిరో తెలిసికొనుట యవసరము.

అభిషేకమొక క్రతువు. పవిత్ర మంత్రములతో రాజు కాబోవు వ్యక్తిని సింహాసనముపై ప్రతిష్ఠించు కార్యము. రాజుగా నెన్నుకొన్న క్షత్రియుడు, అభిషేచనానంతరము మూర్థాభిషిక్త క్షత్రియుడగును. రాజ్యాభిషేచనమనునది సిద్ధమైన ఆర్యుల ఆచారము. దీనినెట్లు జరుపవలెనో వేదములందుగూడ సూచింపబడినది. రాజ్యాభిషేక క్రతువు వాజపేయము, రాజసూయము, పునరభిషేకము, ఐన్ద్రాభిషేకమని నాల్గు విధములు. ఇందు వాజపేయమున అభిషిక్తార్హుడైన క్షత్రియకుమారుడు 17 రథముల పోటీలో గెల్వవలెను. తర్వాత నాతడు సతీసమేతుడై స్తంభాగ్రమందు నిల్పిన రథ చక్రముపై నాసీనుడై భూదేవి నారాధించిన పిదప ఆతనిని శతపథ బ్రాహ్మణ సూత్రముల ప్రకారము మేకచర్మమును పరచిన సింహాసనముపై నాసీనునిచేసి అధర్వుడు నాతని ప్రభువుగ ప్రజానురంజకుడుగ వర్ధిల్లునట్లాశీర్వదించి ప్రకటించవలెను.

శతపథ బ్రాహ్మణమున రాజసూయము విపులముగ వర్ణితమైనది. సాధారణముగ ఫాల్గుణ మాసమున నారంభించు నీక్రతువు రెండు సంవత్సరములకు పైననే జరుపబడును. ఎన్నో యాగములు, ఇష్టులు జరిపిన పిదప, యాగ పరిసమాప్తి నొందిన తదుపరి

(1) రాణులను, రాజోద్యోగులను సత్కరించుట, (2) అభిషేచనము (3) దిగ్వ్యాస్థాపన, (4) వ్యాఘ్రాజినముపై నడచుట, (5) శునశ్శేపుని కథాశ్రవణము. (6) లీలా గోగ్రహణము యుద్ధము, (7) సింహాసనాసీనుడగుట, (8) జూదము, రాజు నిర్వహింపవలసిన విధులు. అభిషేచనము సవితా సత్య ప్రసవ, అగ్ని, గ్రహపతి, సోమ, వనస్పతి, బృహస్పతి, వాక్, ఇంద్ర, జేష్ట, రుద్ర, పశుపతి, మిత్రవరుణ, ధర్మ, పత్యాదేవతా తర్పణములతో రాజపురోహితుడుగాని, రాజభ్రాతగాని ఆరంభించవలెను. పునరభిషేచనము, ఇతర రాజుల నోడించిన తదుపరి చేయు క్రతువు. ఇందు రాజు కాబోవు వ్యక్తిని అత్తి చెట్టు కర్రలతో చేసిన సింహాసనముపై కూర్చుండబెట్టి పవిత్ర జలముతో నభిషేకించి రాజపురోహితుడాతనిని "రాజ్ఞాం త్వం అధిరాజో భవేహ. మహాన్తం త్వం మహీనాం సంరాజం చర్షణీనాం" అను మంత్రోచ్చారణతో సింహాసనము నధిష్ఠింప జేయవలయును. తర్వాత రాజు తన పురోహితునికి నమస్కరించి యాతని యాశీర్వాదములను పొందవలెను.

ఐంద్ర మహాభిషేకమున రాజగు వ్యక్తికి పురోహితునివద్ద ప్రమాణస్వీకారము, సింహాసనారోహణము, ఉత్క్రోశనము, అభిమంత్రణాదులైన పిదప అభిషేచనము చేయవలెను.

వాజపేయముచేసి క్షత్రియుడు రాజై, రాజసూయముతో "సామ్రాట్" లేక "చక్రవర్తి" యగునని కాత్యాయనుని శ్రౌతసూత్రములందు తెలుపబడియున్నది. అన్నిటికన్న ఉత్తమోత్తమము, దుస్సాధ్యమునైన క్రతువు అశ్వమేధము. భవభూతి ఉత్తరరామ చరిత్రలో "అశ్వమేధ ఇతి విశ్వవిజయినాం క్షత్రియాణాం ఊర్జస్వలః సర్వక్షత్రియ పరిభవీ మహాన్ ఉత్కర్ష నిష్కర్షః" అని వర్ణించియున్నాడు.

"అశోక", "ప్రియదర్శి", "రాజా" అను శాసనములలో గానవచ్చు పదములాతని బిరుదులో, నామములో అయివుండవచ్చును. ఈ పదములు ఆతని అభిషేకముతో అత్యంత సంబంధము కల్గినవని కొందరు చరిత్రకారుల ఊహ.

దీపవంశమునందు బిందుసారుని కుమారుడైన ప్రియదర్శునకు క్రీ. పూ. 219 సంవత్సరమున అశోక నామముతో అభిషేకము జరుపబడెనని చెప్పబడినది. ఈ విషయమే బుద్ధఘోషుడు తన "సుమంగల విలాసిని" కావ్యములో తెల్పియున్నాడు. కాని మూల సర్వాస్తివాదుల గ్రంథమైన "దివ్యావదానము" ప్రకారము "అశోక" నామము నతని తండ్రియే పెట్టినట్లు తెలియుచున్నది.

అశోకుని "ధమ్మసావణ" ములున్న గండ శిలాశాసనములు ఆతని తొలి రాజ్యవర్షముల నాటివని రూఢిగ తెల్పుట కాధారములున్నవి. అందు మనకు కానవచ్చు పేర్లు "ప్రియదర్శి", "రాజా" అనునవి. ఒక్క మాస్కి శాసనములో "దేవానంపియస అశోకస" అని ఉన్నను, అది గణింపతగ్గ మార్పుకాదేమో !

# అశోకుని ఎఱ్ఱగుడి శిలాశాసనములు

అశోకుని సంపూర్ణ రాజ్య బిరుదములు శిలాస్తంభ శాసనములలో గలవు. ఇవి అతని అభిషేకానంతరము 12 వ, 26 వ సంవత్సరముల నాటివి. కాన అతని 12 వ రాజ్యవర్షమునుంచి ప్రియదర్శిరాజా" లేక "లాజా పియదశి" అను బిరుదనామములు వాడబడుచున్నట్లు రూఢియగుచున్నది. ఇందు "లాజ" లేక "రాజా శబ్దము తాను మగధ రాజ్యాధినేతయని తెలుపుటకే చెప్పబడియున్నది.

అటులైన శాసనములలో కన్పించు "ప్రియదర్శి" శబ్దము వర్తించునది, ఆతని నామమునకా లేక బిరుదమునకా యన్నది విచారింపవలసియున్నది. దీప వంశము నందు అశోకుడు తన అభిషేకానంతర మూరు వర్షములకు మరల ప్రియదర్శి బిరుదముతో అభిషేకించుకొనెనని తెల్పుచుండుటచే అశోకుడు పునరభిషేచనోత్సవమునుగూడ చేసి కొనెనని ఊహింప వీలగుచున్నది.

అశోకుడు తన 12 వ రాజ్య సంవత్సరము తర్వాతనే ప్రియదర్శి బిరుద మూనుటచేతను, కళింగ యుద్ధానంతరము ఆ రాజ్యము నాక్రమించి, తద్విజయ సూచకముగ ''మహాన్తం మహీనాం'' అని తన ప్రతిష్ఠ సార్థకపరచుకొనెను.

పాళీగ్రంథములలో అశోకుడు మగధ సింహాసనమును గ్రహించుటకు, తన 99 మంది తమ్ములను చంపెననియు, ఒక్క తిస్సతి వితాశోకుని (దివ్యావదానమందు సుమనుడను నామము కలదు) మాత్రము వధింపక విడచి పుచ్చెనని చెప్పబడియున్నది. అశోకుని శాసనములలో నెచ్చటను నీ భ్రాతృవధ సూచింపబడలేదు. కాని అతని అన్నదమ్ముల సంసారములు పాటలీపుత్రమునందును, ఇతర పట్టణములందును ఉన్నట్లు సూచింపబడియున్నది. పాళిగ్రంథముల ప్రకారము అశోకుని కొకసోదరి యున్నట్లును, ఆమె కుమారుడైన అగ్నిబ్రహ్మకు తన కుమార్తె సంఘమిత్ర నిచ్చి వివాహము చేసినట్లు తెలియుచున్నది.

# అశోకుని ధర్మము

అశోకుని శిలాశాసనములలోని ముఖ్య సందేశము ''ధర్మ'' మను పేర బరగు చున్నది. ఈ ''ధర్మ'' శబ్దము బౌద్ధమత పరముగా వాడబడినట్లు మూడవ శిలాశాసనమున తెల్పబడినను, యితరత్ర ఈ పదము కేవలము అశోక సార్వభౌముఁడు ప్రచారము చేసిన నీతి, నియమములనే సూచించుచున్నవి. ప్రాయశః వారు బౌద్ధమతము నా రూపముగనే గ్రహించిరేమో ! అతని నీతి సూత్రములకును, ''దీర్ఘనికాయమందు'' బుద్ధుఁడు 'శ్రీగాలు'న కిచ్చిన సందేశములకును, సామ్యమెక్కువగనే కన్పట్టుచున్నది.

బౌద్ధ వాఙ్మయమునందు అశోకుఁడు బౌద్ధమతము నవలంబించి, ఉపాసకుఁడై, బౌద్ధుల నాదరించెనని, పలుచోట్ల చెప్పియున్నది. అశోకుని శాసనములలో కూడ నాతఁడు మతాంతరుఁడై, అశోకారామములను పాటలీపుత్రమున నిర్మించుటయేగాక బౌద్ధమత వాస్తుల వ్యాప్తికై 84,000 స్థూపములను గూడా నిర్మించినట్లు తెలిపియున్నాడు. పలుచోట్ల బుద్ధుని తన ప్రభువుగ సంబోధించుట, బౌద్ధమతమే నిజమైన మతమనుటయు గలదు. బుద్ధునియందు, ఆతని ధర్మమునందు, అతడేర్పరచిన సంఘమునందు తన కమిత విశ్వాసమున్నట్లు చాటుటయేగాక, బౌద్ధసంఘములలో, బౌద్ధ సన్యాసులకు, తదితరులకు, పఠించుట కనువైన బౌద్ధమత సూక్తులను తానే నిర్ణయించినట్లు శాసన స్తంభములలో చెప్పుకొనియుండెను. తన రాజోద్యోగులకు పతితులైన సన్యాసులను, సన్యాసినులను, సంఘబహిష్కృతులనుచేయ నాజ్ఞాపించి, సంఘజీవితమును కట్టుదిట్టమొనరించెను. తాను, స్వయముగ, బౌద్ధతీర్థములైన "బుద్ధగయ","లుంబిని" మొదలైన క్షేత్రములను దర్శించి, స్థూప నిర్మాణముల నొనరించి, తన శాసన శిలలపై బౌద్ధ చిహ్నముగ శ్వేతగంధ హస్తి ప్రతిమల మలపించి, తథాగతుని యెడ తనకుగల భక్తి ప్రపత్తులను చాటెను.

మతావలంబనకు పూర్వము అశోకుడు పాపకార్య నిరతుడట ! తొంబది తొమ్మిది మంది సహోదరులను వధించినందునకాతనికి "కాలాశోకుడని" అన్వర్థ నామము కల్గెనట. బౌద్ధమత మవలంబించి, "ధర్మాశోకు"డయ్యెనట. ఈ విషయములదెల్పు బౌద్ధ గ్రంథములు విశ్వాసార్హములు కాకపోయినను, కళింగ యుద్ధానంతరము, చక్రవర్తియందు గొప్ప మార్పు కల్గినది. అతనికి హింస యనిన జుగుప్స ఏర్పడి, యుద్ధ విముఖతను బహిరంగముగ ప్రకటించి, తన మహానసమందు దినదినము వధింపఁబడు పశుపక్ష్యాదుల సంఖ్య గూడ తగ్గించి, అహింసా ధర్మసూత్రమునకు ప్రాధాన్యత నిచ్చెను. తత్పూర్వము మృగయా వినోద యాత్రలు జరుపు వాడుకను మాని తీర్థయాత్రలు చేయుచు, ప్రజా హృదయములను రంజింపఁజేయ ప్రయత్నించెను. తను జైత్రయాత్రలను మానుటయే

గాక తన సంతతి రాజులకు యుద్ధము జనక్షయ కారణమని, భేరీ ఘోషలకన్న ధర్మ ఘోషలే శ్రేయమని, తన రాజ్యములోనేగాక ఇతర రాజ్యములలోగూడ ప్రజలను ధర్మాభి ముఖులుగ జేయ ప్రయత్నింపవలెనని బోధించెను.

బౌద్ధము నాదరించి, దానికి విశ్వవ్యాప్తి కల్గించినది అశోక సార్వభౌముడే. అతని ధర్మానుశాసనములద్వారా ప్రకటితమైన ధర్మము, బౌద్ధ ధర్మమున కన్న భిన్నము. బౌద్ధమతమునకు ముఖ్యములైన నిర్వాణము, చతురార్య సత్య ములు, అష్టాంగిక మార్గముల ప్రస్తావన ఈ శాసనములలో నెచ్చటను కన్పింపదు. అతం డెల్లప్పుడు స్వర్గ సౌఖ్యములను గూర్చి, శాశ్వతానందములను గూర్చియే ప్రసంగించెను.

ఇందువలన ఆతనికి బౌద్ధసంఘ నిబంధనల గురించిగాని, బౌద్ధధర్మసూత్రములను గురించిగాని తెలియదనుటకు వీలులేదు. అశోకుని మతమున, జన్మాంతరమందు సుఖ శాంతులు పొందవలెనన్న, ఈ జన్మమునందు, తాను ధర్మమవలంబించి, ఇతరులచే నవ లంబింపఁజేయుటయని. ఇందు అశోకుని "ధర్మ" మునకు బౌద్ధ 'ధర్మపదము' నందలి సూక్తులకు కొంత సామ్యముఁగలదు. అశోకుని ధర్మానుశాసనములు ముఖ్యముగ, నీతి నియమ సూచకములు. అతని మతమున పాప చింతన లేకుండుట, పుణ్యకార్యాచర ణము, కరుణ, దయ, సత్యము, శౌచము, శీలము, ఆత్మనిగ్రహము, సత్సంకల్పము, అహింస, కోపము లేకుండుట, మొదలగు సద్గుణములు కల్గి, వాటిని పాటించుటయే ధర్మ మార్గానుసరణము. ఇవిగాక, పెద్దలయెడ భక్తి, పిన్నలయందు, బంధువులయందు ఆదరము, మితాహారము, మితవ్యయము, బ్రాహ్మణుల, శ్రమణుల, వయోవృద్ధుల, గౌరవించి, ఆదరించుట, బంధుమిత్రులయెడ ప్రీతి, మొదలైన లక్షణముల నందరు కల్గియుండవలెనని కోరెను. ఇట్టి సద్గుణ సంపద గల్గి, సత్కార్యాచరణమే అశోకుఁడు ధర్మాచరణమనెను. కార్యసిద్ధికి వినయవిధేయతలు, పాపభీతి, ధర్మచింతన, ఆత్మవిమర్శ చాల అవసరమని అశోకుడు తెలిపియున్నాడు.

అశోకుడు వైరభావమును, దుష్ప్రవర్తనను, అసహనమును, అనృతమును నిర సించి, ప్రాణ మత్యంత పవిత్రమైనదని ప్రాణిహింస మానమని బోధించెను. ఈ పరమా ర్థము కొఱకై విందులు, వినోదములయందు సహజముగా జరుగు పశువధను మాన్పించెను. విహారయాత్రలు, సమాజములు, మతవిషయకమై, జ్ఞాన సముపార్జనకు తప్ప నిషేధించెను.

మాతా పితృఋణములతో పాటు, రాజుయొక్క ప్రజాఋణమును గుర్తించి, ప్రజో పయోగములైన కార్యముల చేయుచు, ప్రజలను తన బిడ్డలవలె కాపాడి రక్షించెను. బౌద్ధమతమునందు తన కాసక్తి మెండైనను, పరమత ద్వేషము కించిత్తైనను లేక సకల మతస్థులను సమముగ నాదరించి, తన మత సహిష్ణుతను తన పన్నెండవ శిలాశాసనమున తెలియబరచెను.

అశోకుని 'ధర్మము' సర్వజన సమ్మతము, సార్వకాలికము, సర్వ మత సారము. దానికి దేశ, కాల, పాత్రాది అవధులు లేవు.